# ఆంధ్రభూమి

ఏప్రియల్, 1942.  వెల ౨ అణాలు.

4



సారధి పత్నిలో అద్భుతంగా నటించిన
ఋష్యేంద్రమణి కణ్ణకి.

ఆంధ్రభూమి

సంపుటం : ౧౦. చిత్రభాను, వైశాఖము : ఏప్రిల్, 1942. సంచిక : ౬.

# ఫ్రెంచి ప్రధాని : పియరీలావల్

అధికార వాంఛతో ఆత్మ దేశాన్ని హిట్లరు పొట్టనుపెట్టిన బ్రిటిష్ విద్వేషి, లావల్ తిరిగి హిట్లరు అండతో, ఫ్రాన్సు రాజ్యాంగ ఖలీనాన్ని చేపట్టాడు అతడు హిట్లరుచేతి కీలుబొమ్మ. బ్రిటిష్, అమెరికా దేశాలకు గర్భశత్రువు.

పియరీలావల్ అధికారంతో ఫ్రాన్సు పూర్తిగా హిట్లరు పిడికిట చిక్కినదన్న మాట.

ఒకనాడు లావల్ ద్రోహచింతనం కనిపెట్టి అతన్ని నిర్బంధంలో వుంచినమార్షలు పిటైన్ నేడు లావలుకి లొంగిపోయాడు. అతని అధీనంలోవున్న సర్వసైన్యాధికారం పూర్తిగా హిట్లరు పక్షపాతి డార్లన్ హస్తగతంచేసాడు... డార్లన్ లావల్ కలయిక ఫ్రాన్సు ప్రస్తుతస్థితికి చాలా ప్రమాదకరమైన విషయం.

లావలు పిటైన్ స్థానం ఆక్రమించాలని పారిస్‌నగర పతనంతో ఎత్తులు ప్రారంభించాడు. కాని నేటివరకు కాలం కూడిరాలేదు. లావలుకు హిట్లరు ముస్సోలినీలవలె ఫ్రెంచి దేశానికి ఒక నియంతగా వుండాలని గాఢమైన వాంఛ దానికై అహర్నిశములు పనిచేస్తున్నాడు. అది ఫలోన్ముఖమయ్యే సూచనలు కనుపిస్తున్నాయి. నేడు.

లావలుకి హిట్లరుకంటే ముస్సోలినీ అంటే అభిమానం మెండు. ముస్సోలినీలాగే రాజకీయాల్లో పియరీలావలు కప్పగంతులు వేశాడు. ఆదిలో సామ్యవాది తుదకు నియంతృత్వం అభిలషించే నిరంకుశాధికారి. పియరి లావల్ మూరిష్ జాతీయుడు అతని జన్మస్థలం అవెర్గ్ని తండ్రి ఒక కసాయివాడు.

అతనికి లాటిన్ భాషాభిమానం మెండు లాటిన్ భాష మాట్లాడే ఇటలీ ఫ్రాన్సు; స్పెయిన్ దేశాలను కలిపి ఒక ఫెడరేషన్ తయారుచేయాలని అతనియత్నం.

లావలు న్యాయవాది పరీక్షకు చదివాడు. అతడు న్యాయవాది వృత్తిలో అపారమైన ధనమార్జించాడు ఆధనంతో రాజకీయాలలో దిగాడు.

1935 లో అతడు ఫ్రాన్సు విదేశాంగ మంత్రిగా వున్నాడు. ఆసమయంలో అతడు ముస్సోలినీతో రహస్యంగా ఫ్రాన్సు తరపున ఒక ఒడంబడిక చేసుకొని అబిసీనియాను అప్పటికి ముస్సోలినీకి ఒప్పగించాడు.

పిటైన్ ప్రభుత్వంలో లావల్ ఉపప్రధానిగా వున్నాడు. అతడు హిట్లరుతో సంప్రదించి హిట్లరు సంధిషరతులను పిటైన్‌కి అందచేశాడు. అది 1940 అక్టోబరు మాసంలో జరిగినవిషయం. పిటైన్ లావలు తంత్రానికి లొంగలేదు అమెరికాబలం చూసుకొని లావలును త్రోసి రాజన్నాడు. అప్పట్లో డార్లన్ ఉపప్రధాని పదవి పొందాడు.

జర్మనీ రష్యాతో తలపడిన వెనుక ఫ్రాన్సులోని కమ్యూనిస్టులపై నిర్బంధం మితిమీరిపోయింది.

కమ్యూనిస్టులు చెలరేగారు. వాళ్ళ కోపానలానికి గురి అయినవాడు లావలు వెర్సైలీన్స్ నుండి రష్యా రంగానికిపోవ సంసిద్ధంగవున్న ఫ్రెంచి వాలంటీరులను సందర్శించడానికి వెళ్ళాడు లావలు. అతడు వాలంటీరులను పరిశీలిస్తున్న తరుణంలో పాల్ కలెట్టీ అను నాతడు స్తంభం చాటున నక్కి లావల్‌ని గురిచూచి కాల్చాడు. ఆగుండుదెబ్బ లావలు గుండె దూసుకుపోయింది. మూల్గుతూ నేల కూలిపోయాడు. అతడు చనిపోయాడనే వార్తలు ప్రపంచమంతటా పాకిపోయింది. లావలుకి గుండుదెబ్బ తగిలిందని తెలిసినవెంటనే జర్మన్ హైకమాండు తమ అధీనంలోవున్న ఆరితేరిన యిద్దరు సర్జనులను పంపించి. వారుఅతని గుండెలలోవున్న గుండుతీసి అతనికి ప్రాణదానం చేశారు.

గుండు తీసివేసిన వెంటనే లావలు భార్యతో టెలిఫోనులో మాట్లాడాడు.

చావును జయించిన వ్యక్తి లావలు.

ఇప్పుడతడు ఫ్రాన్సు సర్వాధికారి. డార్లన్ సర్వసేనాని పిటైన్ నామమాత్రానికి ఫ్రెంచి ప్రభుత్వ ప్రధాని— అధ్యక్షుడు— ఫ్రాన్సు వలసరాజ్యాల శక్తి సంపదను అంతనూ హిట్లరుకి ధారాదత్తం చేయడానికి సంకల్పం చెప్పుకున్నాడు లావలు జర్మనీతో సంపూర్ణ సహకారమంటే ఇంగ్లాండు అమెరికాలతో విరోధమన్న మాట.

—కొత్తపల్లి శ్రీరామమూర్తి.

# మదరాసు: యమధర్మరాజు హెడ్ క్వార్టర్సా?

'పెరుగుట విరుగుటకొరకే ధర తగ్గుట హెచ్చుకొరకే' అన్నట్టుగా బంగారం ధర తగ్గినట్టుగానే తగ్గి అపారంగా పెరిగిపోయింది మదరాసు మహానగరంకూడా నాలుగుమూలలా తెగ పెరిగింది. చూస్తూవుండగానే విరిగిపోయే అవలక్షణాలు పడుతున్నాయి.

సుధా దవళిత సౌధాలతోను, నందనోద్యానాలవంటిపార్కులతోను కాళరాత్రినాడు కూడా చీకటిని దాపోనీయకుండా తెరిమిల్లోట్టేవిద్యుద్దీపాలతోను కన్నుల వైకుంఠంగా విరాజిల్లే మదరాసు మహానగరం. నిత్యం జనసమ్మర్ధంతో నిండి వుండే బీచి నేడు నిర్జనమై పాడుపడ్డాయి. రాజహంసలు విహరించే గృహాంతరాళములలో గుడ్లగూబలు నివాసం ఏర్పరచుకొన్నాయి.

ఆనాడు అంటే యిప్పటికి సుమారు మూడువందల ఏండ్లక్రితం ఈస్టిండియా కంపెనీ ఇండియామట్టిమీద పాదుకొనుచున్న ప్రభాతసమయంలో ప్రజలను ఆహ్వానించి వూరువాడలు కట్టియిచ్చి కాచి రక్షించిన ఆ ప్రభువులే నేడు ఇల్లు వాకిళ్లు వదిలి వెళ్ళిపొమ్మని కటువుగా హెచ్చరిస్తున్నారు. అట్లా పెరిగినవే చింతాద్రిపేటా పెద్దునాయకన్ పేట చాకలిపేట మొదలైన పేటలు. ప్రజారక్షణయే విధ్యుక్తధర్మముగా యోచించు ప్రభుత్వమే గాంభీర్యమును సడలిస్తే సామాన్యులు లెక్కా ప్రజారక్షణ వహించని ప్రభుత్వం బాధ్యతాయుత ప్రభుత్వమనిపించుకోదు. ధీశాలి చర్చిల్ ఎన్నడైనా దైన్యభావాన్ని లండను ప్రజలకు కాని ఇంగ్లాండు ప్రజలకు కాని అందనిచ్చాడా!

నేటి మదరాసు పరిస్థితులు చూస్తే నాకు భర్తృహరి శతకంలోని పద్యం ఒకటి జ్ఞాపకంవస్తోంది.

శా॥ 'ఆకాశంబునుండి శంభుని శిరంబందుండి శీతాద్రి సు
శ్లోకంబైన హిమాద్రినుండి భువి భూలోకం జలంబుండియు
స్తోకాంభోధి బయోధినుండి పవనాధో లోకముంజేర గం
గాకూలంకష పెక్కుభంగులు వివేకభ్రష్ట సంపాతముల్.'

ఆలాగే 1639 ప్రాంతంలో తెలుగువారి అనుగ్రహంవల్ల ఈస్టిండియా కంపెనీవారు పొందిన మదరాసు మాగాణి అచిరకాలంలోనే భారతదేశ రాజకీయాలను తారుమారు చేసింది.

ఇంగ్లీషువారి పరిపాలనలో నాలుగుమూలలా పెరిగి గణనకెక్కినది. ఇటు ఆంధ్రులకు అటు అరవలకు దాని ప్రాధాన్యం నోరువూరునట్లుచేసింది. దాని కొరకు మదరాసునగరంలో రక్తప్రవాహాలు ప్రవహిస్తాయనికూడా ఒక శకునపక్షి కూయసాగింది.

చక్కని సముద్రతీరంతో మనోహరంగావుండే మదరాసు నగరం ఇప్పుడు పాడుపడ్డ దేవళంలా వుంది. ప్రభుత్వ కార్యాలయాలు, పల్లెలు పట్టాయి, 'యథారాజా తథాప్రజ' అన్నట్టు ప్రభుత్వమే పల్లెపట్టు లాశ్రయిస్తూవుంటే సామాన్యుల సంగతి చెప్పాలా. కంటికింపుగా పచ్చని పూల మొక్కలతో సొంపైసలారే పార్కులు గోరీలతో నిండిన శ్మశానభూములులా గైనాయి (ట్రెంచెస్)

దేదీప్యమానంగా ప్రకాశించే విద్యుద్దీపాలు భయోత్పాతంతో మునుగుతన్నాయి. భీతికొల్పే కారుచీకట్లె మదరాసు మహానగరాన్ని బిగి కౌగిటలో బంధించుకొన్నది. లక్ష్మీదేవి ఘల్లుఘల్లుమని నాట్యం చేసే హోటళ్లు సినిమాలు (యింగ్లీషువితప్ప) గప్పుచిప్పుగా మూసుకుపోయాయి. మదరాసు మాదంటే మాది అనే మహనీయులంతా కుక్కినపేనులాగ వూరుకొన్నారు ఆంధ్రకేసరి మాత్రం మదరాసులో తాణ్యంవేసుకుని కూచున్నాడు. తనశాంతిసైన్యంతో మదరాసు ముమ్మాటికి మాదేనని నిరూపించడానికి ఆంధ్రపత్రిక కార్యాలయం అలాగేజండా ఎగుర వేస్తోంది;

నేను మదరాసులో తినుటకు తిండికూడాదొరక్కుండాపోయింది.

ఇది అంతా చూస్తూవుంటే మదరాసుని కాని యమధర్మరాజు హెడ్ క్వార్టర్సుగా చేసుకొనబోతున్నాడా అన్న అనుమానం కలు

గుతోంది? లేకుంటే యింతమంది జనం ముందువెనుక లాలోచింపకండా ప్రాణాలు అరచేత పెట్టుకొని ఉన్న వెండి బంగారాలను ఎంతకో కొంతకు తెగనమ్మి పారిపోతున్నారంటే నాకు అంతకన్నా మరేమీ కారణం కనుపించడంలేదు. ఈప్రయత్నమంతా మృత్యుదేవత గహ్వరనుండి తప్పించుకోడానికే! ఈకాలంలో మృత్యుముఖం నుండి తప్పించుకోగల ప్రదేశం పదునాల్గు భువానాలలో ఎక్కడ వెతికినా కనుపింపదు. మృత్యుదేవతను ఎదిరించి పోరాడువాడే ప్రభువు. యమకింకరులుకూడా అతని కింకరులవుతారు.

ఇప్పుడు మదరాసు శోభా దరిద్రాణమై అకాలభైరవుని నాట్యరంగమై విరాజిల్లుతున్నదంటే అతిశయోక్తి కాదు. యమధర్మరాజు. వేవకువేలు తన కింకరులను మదరాసు నగరానికి దింపుతున్నట్టు. చిత్రగుప్తుడు వార్తలు ఏమన్నా పంపుతున్నాడా? ఎందుకింతభయం.

బ్రిటిష్ప్రభుత్వ ఔదార్యంవల్ల వీరత్వమంటే ఏమిటో ఎరుగకండా కడుపులో చల్ల కదలకండా వళ్ళు పెంచుకొన్న కుబేరతనయులందరూ సతీసుత సమేతంగా మదరాసు విడిచారు. ఇక అద్దెకొంపలలో వుండే వారి సంగతి చెప్పనక్కరలేదు. ఈ భయోత్పాతంవల్ల బాగుపడ్డ వారు రైలు కంపెనీలు, బస్సులు లారీలు, జట్కాలు, రిక్షావాళ్లు అనక తప్పదు. ఇంతవరకూ బ్యాంకుల్లో మూలుగుతూ కరడు కడివున్నధనం తిరనాళ్ళలోని సెనగపప్పులా చెల్లుబడి అయిపోయింది. తుదకు మదరాసులో చిల్లరి దొరకనిస్థితికూడా ఏర్పడింది. మొత్తం మీద మదరాసు పౌరులు తమ నీడలు తామే చూచుకుక బెదిరిపోయి మదరాసుని పాడుపెట్టి పోతున్నారా? ఏదైనా మదరాసుభావి శూన్యంగా కనిపిస్తుంది. లేక జపానుదాడికన్నా మనసైనికుల దుండగీడుతనాలకు భయపడి పలాయనం చిత్తగించారా అనిపిస్తుంది. ఆభీతి లేకండాచేసే బాధ్యత ప్రభుత్వం మీదవుంది. మదరాసు మిలటరీ ఉపయోగానికి నిర్జనంగావుండాలా?

'అమ్మ' శబ్దంలోని అమృతంకొరకు తపించిన

# సుశీల

రచయిత :

చోడవరపు రామశేషయ్య

౧

'అక్కా! నిన్ను కొట్టుతా' అని చేతిలోనున్న కొయ్య ఏనుగును ఎత్తినాడు, మనోహరుడు.

'అవును; ఎందుకు కొట్టవు? ఇందుకనేగదా, నిన్ను కన్నది!'

రఘునాధరావు భోజనంచేస్తున్నాడు. తల్లి కొడుకుల పోట్లాట విని నవ్వాడు. ఆనవ్వు అగ్నిలో ఆజ్యంపోసినంత పనిచేసింది. సుశీల కనుబొమలు ముడిపడ్డాయి. తమ ముద్దుల బిడ్డ దుడుకుతనానికి ఎందుకు నవ్వరు! ఇందుకునేగదూ వీడిని పెంచి పెద్దవాడిని చేస్తున్నది, అని సణుగుకుంది, ఆమె.

ఆమెను రెచ్చకొట్టడానికి రఘునాధరావుకు మంచి సమయం దొరికింది. 'నీవా! వాడిని పెంచేద' అని అన్నాడు.

'మరెవ్వరు వీడిని నాలుగేండ్లనుంచి పెంచుతుంది?'

'నీవే ఆలోచించుకో.'

'కాదు, మీరేచెప్పండి.'

'నీ ఆడబిడ్డ కమల.'

సుశీల భర్తమాటకు లొంగిపోయింది. దీని కామెదగ్గఱ జవాబు యేమి లేకపోవటంచేత సిగ్గుపడింది. అయినప్పటికి మామూలుగా తగ్గేమనిషి కాదు.

'నేను వాడి అమ్మనుకాదా. అని తన అధికారాన్ని నిరూపిస్తూ అంది ఆమె.

'కాని, మనోహరునకీ సంగతి తెలుసా! నీ వెప్పుడైనా వానితో చెప్పినావా? నేను నీ అమ్మనుఅని' రఘునాధరావు కిలకిలలాడుతు అడిగినాడు. ఆమె మాటాడలేదు.

'పోనీ నీ వెప్పుడైనా వాడిని ఎత్తుకుని ఆడించినావా?' అని రఘునాధరావు అన్నాడు.

నోరెత్తకుండా జవాబు చెప్పాలనుకుంది; కాని ఏమీ ఉపాయం తోచలేదామెకు. రెండు కన్నీటి బిందువులు మాత్రం ఆమె పసిమి కపోలాలపై మెఱసినాయి. వాటిని దాచుకోవటానికి గబగబ తన గదిలోకి పోయింది.

కమల రఘునాధరావు యొక్క చెల్లెలు. ఆమెకు చిన్నప్పుడే పెండ్లి అయింది. కాని ఆమె నుదుట సంసారసుఖం లిఖింపలేదాబ్రహ్మ. ఆమె జ్ఞానం వచ్చేనరికి తన యీ జీవితం కష్టాలకేగాని సుఖాలకు కాదని తెలిసికుంది. ఆమె శ్వేతవస్త్రాలు చూడదలచలేదు కాబోలు, ఆమె తలిదండ్రు లంతకుముందే స్వర్గానికి పోయారు. అప్పటినుంచి ఆమె రఘునాధరావు వద్దనే ఉంటోంది. రఘునాధరావుకు ఆమె అంటె చాలప్రేమ; కాని వెలవెల బోయిన ఆమె ముఖము, గుంటలుపడ్డ ఆమె కళ్లుచూచి లోలోపలకుమిలిపోయేవాడతను.

మనోహరుడు పుట్టేసరికి శుష్కించిపోయి ఉన్న కమల జీవితంలో మార్పు కలిగింది. ఆమె హృదయ కమలం విప్పారింది. మనోహరుని సాకేభారమంతా తనమీద వేసుకుంది. సోమరి సుశీల తప్పిందే చాలు ననుకుంది.

౨

రాత్రి ఎనిమిది ఘంటలయింది. రఘునాధరావు స్నానంచేసి అప్పుడే స్నానాగారంలోనుంచి బయటికి వచ్చాడు. సుశీలకోసం ఆయన చూపులటుయిటు పరుగెత్తాయి; కాని, ఊరికేనే మఱలివచ్చాయి. హాల్లో కుర్చీలో కూలబడ్డాడు.

అకస్మాత్తుగా సుశీల గదితలుపులు తెరవబడ్డాయి. ఒక చేతితో నగిషీ పనిచేసి ఉన్న బంగారపుగిన్నె, రెండవచేతితో వెండి గ్లాసు పట్టుకుని బయలుదేరింది. ఆ

[మిగతా ౨౨౧ లో చూడు.

# మేకల్లా మనంతినే ఆకులు

## అవి గంజాయి, పొగాకుల వంటివికావు

తమలపాకు తీగను అర్జునుడు స్వర్గలోకాన్నుంచి తస్కరించుకు వచ్చాడా ?

పెరూదేశీయులువాడే కోకో ఆకులవల్ల దివ్య జ్ఞానం కలుగుతుందా ?

మెక్సికోలోని పియోటల్ ఆకులకు, మన సోమలతకూ సంబంధం వుందా ?

నాగరికత పెరిగినకొద్దీ నిషా వస్తువులవాడకంకూడా పెరుగుతూ వుంది.

ఈనాడు ఏదో ఒక నిషావస్తువు లేనిదే నాగరికమానవుడు దినం వెళ్ళబుచ్చలేకుండా వున్నాడు.

ఒకకప్పు టీ కడుపులో పడితే కాని కాలు కదపలేనివారు కొందరు—

ఒకగ్లాసుడు కాఫీ కంఠందిగితే కాని పదచలనానికి పూనుకోలేనివారు కొందరు—

ఒక యాస్పరినుమాత్ర పడితే కాని ఏపనీ చేయలేనివారు కొందరు—

సిగరెట్టు దమ్ములేనిదే కాగితం మీద శ్రీరాములు చుట్టలేనివారు కొందరు—

ఏదో నిషాలేనిదే నాగరికులకు నిమిషం గడవనిస్థితి నేడు ఏర్పడి వుంది.

ఈవ్యసనం నాగరికులకే కాదు, ఆధునికులకే కాదు. అనాగరికులకీ వుంది, పూర్వీకులకీ వుంది.

తేడా ఏమిటంటే అనాగరీకులు, పూర్వీకులు తమ నిషావస్తువులు దేవదత్తాలనీ, అవి మహత్తుగలవనీ చెప్పడం, నమ్మడం.

నిదర్శనంగా మనలోనూ, మలయా దేశీయుల్లోనూగల తాంబూల చర్వణం సంగతి గమనించండి.

పాశ్చాత్యులకు, నేటి ప్రాచ్య నాగరికులకు ఇప్పుడు పొగాకు ఎంత అవసరమో మనదేశీయులకూ, మలయా దేశీయులకూ తాంబూలం అంత అవసరం.

తాంబూలం లేకపోతే దినమంతా తలనొప్పితో బాధపడేవారు మనలో ఎందరో వున్నారు.

### తమలపాకు

తమలపాకులకు దివ్యత్వం ఆపాదిస్తారు మనవారు.

స్వర్గలోకయాత్ర చేసినప్పుడు అర్జునుడు అచ్చటినుండి తమలపాకుతీగను ఒకదానిని తస్కరించుకునివచ్చి భూలోకానికి ప్రసాదించాడనే ఐతిహ్య మొకటివుంది.

తాంబూలం ప్రసాదమైన నిషాను ఇస్తుంది. తమలపాకుమీద కొద్ది సున్నంరాసి వక్కపొడివేసి చుట్టి నమలడమే తాంబూలం. తమలపాకులు దొరక్కపోతే అప్పుడప్పుడు వక్కముక్కైనా నమలడం మనలో ఆచారమైవుంది.

తమలపాకురసం సువాసనగలది. అందులో ఒక విధమైన క్షారపదార్థంవుంది. ఆక్షారపదార్థాన్ని శాస్త్రవేత్తలు ఇంతవరకు వేరు చేయలేక పోతున్నారు.

పోకచెక్క నములడంలో ఉపయోగపడుతుందే కాని దానివద్ద ఉషారుపుట్టించే గుణం వున్నట్లు కనిపించదు. అందులో ఎర్రరంగు పదార్థంవుంది. తాంబూలం వేసుకునేవాడి లాలాద్రవాన్నిఅది ఎర్రపరుస్తుంది. వక్కల్ని చాలాకాలమూ, విశేషంగానూ వాడితే పెదిమలూ, పళ్ళూ నల్లబడతాయి.

తాంబూలం జీర్ణకారి అని చెబుతారు. మనదేశంలో పేదవారు కొందరు బాగా ఆకలిగా

వున్నప్పుడు తాంబూలం వేసుకోని ఆకలిని చంపుకోవడం వుంది.

వైద్యగ్రంథాలలో తాంబూలానికి ముప్ఫయి సుగుణాలు వివరింపబడి వున్నాయి.

తాంబూలం ఈయడమనేది ఒక సత్కారం. ఈ ఆచారం పురాణ ప్రసిద్ధమైనది.

దేవదమనుడు నీలివస్త్రధారియై విక్రమార్కుని ఆస్థానానికి వచ్చాడని చెప్పబడే కథలో దేవదమనుడి చేతుల్లో వక్కలు, నోట్లో కల్పవృక్షపు ఆకుల్లో చుట్టబడ్డ వక్క వున్నట్లు కలదు.

చైనాలోనూ తాంబూల చర్వణం కలదు.

## కోకో ఆకు

పెరూ దేశీయులు తమలపాకులకు బదులు కోకో ఆకులు (Coca) తారు. ఈ కోకోనుంచే నాగరికులు కొకెయిను తీస్తారు.

కొకెయిను యొక్క దుర్గుణాలు కోకోవద్ద లేవు. కోకో ఆకుల్లో పలు రకాల క్షారపదార్థాలు మిశ్రితమై వున్నాయి.

కోకో ఆకులు రెండు రకాలు. బొలీవియా రాష్ట్రంలో లభ్యమయ్యే కోకో దళసరిగా, పైన ముదర ఆకుపచ్చగా, కింద తేలిక పసుపు పచ్చగా వుంటుంది. పెరూలో పెరిగే ఆకులు చిన్నవిగా, ఎక్కువ

## రాట్నము పాటలు

ఏకులూడక లేను యెదురెట్టలేను
పాపజాతి దేశానికి పన్నెట్టలేను.
ఏకులరాటమ్ము కాళ్ళసంకెళ్ళు
ఏపాపకర్ముడు కావించినాడో?
అసుబోయ నేల అనతిప్ప నేల?
మాలాణ్ణి తిట్ట నేల మాట బడ నేల?
పుంజమ్ము నూలికి పోగుతక్కువా!
కొండమీద ప్రొద్దుంది కొట్టబోకత్తా!
చేనివారొస్తారు చెప్పబోకత్త.
మానవతి ఆడోరికి మర్యాదగాదు.
జంగమయ్యగారి చిటి మఠములోను
జమ్మకు విస్తళ్లు లింగధారులకు.
ఆటప్రాయమునాడు అత్తింటికిబోతే
మాటలకు కొదువంటె మాంచాల మనకు.
మంచిగంధముగదరా అన్న నీవొల్లు
మంచాల గోరింది పంచరాత్రుల్లు.
వాడవాడలజోగు వాడల్లజోగు
ఓరుగంటి వెల్లమ్మ వజ్రాలజోగు.
ఇంటికా డిల్లాలు ఒక్కతున్నాది
విసరవే చల్లగాలి కురవవే వాన.
ఆపద కాలాన భూపతిరాజు
అన్నసత్రము పెట్టి మమ్మాదరించు.

—నేదునూరి గంగాధరము.
(రెడ్డిరాణి)

---

సున్నితంగా, తేలికరంగులో, అదుగున బూడిద వర్ణంతో వుంటాయి.

ఎండిన కోకో ఆకులు ఒక విధమైన సువాసన కలిగి వుంటాయి.

వైద్యశాస్త్రరీత్యా పెరూజాతి కోకో ఆకు శ్రేష్టమైనది: అందలి క్షారపదార్థ మిశ్రమవిధానం గాఢతరమైవుంది. బొలీవియా ఆకు నుంచి ఎక్కువ కొకెయిను లభ్యమవుతుంది.

కొకెయిను మనకు మత్తుమందు. నాగరికులు నేడు కోకో ఆకుల నుండి కొకెయిన్ను విడిదీసి లాభసాటి వర్తకం చేస్తున్నారు.

పెరూవియనులు, పాపం, ఆ లాభసాటి బేరం ఎరగరు. వారు కోకో ఆకుల్ని మన తమలపాకుల వలె ఉపయోగిస్తారు.

మనం తమలపాకుల్ని సున్నంతో ఉపయోగించినట్లే పెరూవియనులు కోకో ఆకుల్ని సున్నంతో ఉపయోగిస్తారు. వారి భాషలో సున్నానికి 'లిప్తా' అని పేరు. కొన్ని పళ్లు ఎండబెట్టి తయారుచేసిన బూడిదను కూడా వారు ఈ తాంబూలంలో ఉపయోగిస్తారు.

ఈ తాంబూలంవల్ల వారి రోగనిరోధకశక్తి పెంపొందుతుంది. ఆ కొండప్రదేశాల్లో ఈ తాంబూలం వల్లనే వారు బాగా పనిచేయగలుగుతారు.

నీరసాన్ని పోగొట్టి, పుష్టిని కూర్చే గుణం కోకో ఆకుల్లో వుంది.

కేవలం కోకో ఆకుల ధారకంతో ఇరవై ఒక్కరోజులు బ్రతికినవారు వున్నారు.

కోకో ఆకుల తాంబూలంవల్ల

రక్తవృద్ధి, రక్తప్రసార విస్తృతి, జీర్ణశక్తి కలుగుతుందని అనుభవజ్ఞులంటారు. దానివల్ల బుద్ధికి చురుకు, నరాలకి పుష్టి, కండరాలకి బలమూ కలుగుతుంది. బాగా చెమట పట్టుతుంది నిద్రను కలిగిస్తుంది.

నరాల నిస్సత్తువ రోగానికి కోకో ఆకులు పరమహంస క్రియగా పనిచేస్తాయి. కంఠస్వరాన్ని బాగుపరచడంలో కూడా కోకో ఆకుల తాంబూలం ప్రశస్తతరమై వుంటుంది.

కోకో ఆకులు ఎన్నాళ్లు ఉపయోగించినా అలవాటుకావు. కొన్నాళ్లు ఉపయోగించి మానివేసినా అందువల్ల ఆమనిషికి ఏమీ ఇబ్బందివుండదు.

కోకోనుంచి తయారైన కొకెయిన్‌ను కొందరు దుర్వినియోగం చేశారనే సాకుతో ప్రజల్లో కోకో యొక్క విస్తృతోపయోగాన్ని నిషేధించడం అంత ప్రశస్త విషయంకాదు.



## పియోటిల్ ఆకు

మెక్సికో దేశీయులు పియోటల్ అనే ఆకుల్ని తాంబూలానికి ఉపయోగిస్తారు. వానిదగ్గర అతీత శక్తులు వున్నాయని వారినమ్మకం.

. పియోటల్ (Peyotl) ఆకుల గుణాలుకూడా కోకో ఆకుల గుణాలతో జతపడివుంటాయి.

ఆ ఆకుల్లో విషపదార్థం ఏమీ లేదు. తినేవాళ్ళ మనస్సుమీద దాని ప్రభావం అమోఘమై వుంటుంది.

పుచ్చుకోవలసిన విధంగా దానిని పుచ్చుకుంటే అది దివ్యజ్ఞానాన్ని కలిగిస్తుందంటారు. దొంగల్ని, హంతకుల్ని తెలుసుకోడానికి దానిని విరివిగా వాడతారు.

ఒకడికి పియోటిల్ ఆకులు బాగా పెడతారు. ఆమైకంలో అతడు దొంగని పేర్కొంటాడు. ఆ పేర్కొంటాలు తరుచు నిజాలే అవుతూవుంటాయి,

కోకోను కూడా ఈవిధంగా వాడవచ్చునని తోస్తుంది.

హిందువులు తమలపాకులు, పెరూవియన్‌లు కోకా ఆకులు ఉపయోగించేటట్లే మెక్సికో దేశీయులు పియోటిల్ ఆకుల్ని వాడతారు.

పియోటిల్ వాడకం జలుబుని తగ్గిస్తుంది; ఆకల్ని పోకారుస్తుంది; నీరసాన్ని పోగొడుతుంది. దమ్ముని హెచ్చిస్తుంది. ఉద్రేకాన్ని కలిగిస్తుంది, చురుకుని పుట్టిస్తుంది.

మన వేదాల్లో సోమలత విశేషంగా వర్ణింపబడింది. ఆ సోమలత గుణాల్లో కొన్ని పియోటిల్‌లో కనిపిస్తూవున్నాయి, మెక్సికో నాగరికతకు, ప్రాచీన హైందవనాగరికతకు సంబంధంవున్నట్లు రూఢమవుతూవుంది. మెక్సికో దేశీయుల పియోటిల్ మన వేదాల్లోని సోమలత ఒకటే ఏమో! ఇది పరిశోధింపతగ్గ విషయం.

ఏదేశంలోని మూలికలు ఆదేశపు రోగాలను కుదిర్చే మహత్తు కలిగివుంటాయని చెబుతారు. ఏదేశపు మూలికలు ఆదేశవాసులకు తగినవనే వాక్యం సత్యసమ్మతమైనది.

అనేక ఓషధుల మర్మాలు నాగరికులమైన మనం మరిచిపోయాము. మరిచిపోయిన ఆ విజ్ఞానాన్ని మళ్ళీ పొందడానికి మనం ప్రయత్నంచేయాలి.

పల్లెపదాలు, జానపదగీతాలు, పిట్టకథలు, కట్టుకథలు క్రోడీకరించి సవిమర్శకదృష్టితో పరిశీలిస్తే ప్రస్తుతంలో మరుగుపడివున్న ఓషధీవిజ్ఞానం మనకు కొంత ఉపలబ్ధంకావచ్చు.

## సుఖప్రసవానికి

స్త్రీలు సుఖముగా ప్రసవించుటకు తోడ్పడెడు అవర్టీను అను నిరపాయకరమైన ఒక మూలిక ఇటీవల కనిపెట్టబడెను. ఎనీమా యిచ్చినట్లు దీనిని శరీరములోనికి ప్రవేశపెట్టగనే నిద్రవచ్చి గర్భవతికి స్మారకము తప్పిపోవును. అపుడు ప్రసవవేదన లేకయే ఆమె బిడ్డను కనును. ఇది ఆదిలో జర్మనీలో ఉపయోగింపబడినది. పిమ్మట ఇతర చోట్ల వాడుకచేయ మొదలు పెట్టినారు.

—ధర్మసాధని.

✳ అచ్చుతీరి అమ్మకమునకు సిద్ధముగా ఉన్న శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారి గ్రంథములు

## ఆంధ్రరమణీమణులు భా-౧

ఇందు—కాకతీయాంధ్రసామ్రాజ్యసింహాసన మధిరోహించి జనరంజకముగ, శత్రుభయంకరముగ రాజ్యమేలిన రుద్రమ్మ; ధరణికోట సింగపుపీఠి నెక్కి అసామాన్యముగ రాజ్యచక్రము త్రిప్పిన గణపమ్మ; ఆంధ్రదేశమున అడుదియై పుట్టిన మంత్రిరాక్షసుని అపరావతారముగా నాయకురాలను బిరుదుగాంచిన పలనాటి నాగమ్మ; కౌగిలిలోనున్న భర్తను దీవించి కరవాలమొసగి కదనరంగమునకంపిన మాంచాల; ప్రజారంజకముగ పెద్దాపుర సంస్థానమును పాలించి తురక ఫౌజుదారుని బారి పడకుండ జోహారొనర్చిన అభిమానస్వరూప రాగమ్మ; ఆమె చేతులనుండి ఆమె మనుమని ఏడు మాసముల కసుగందుని గ్రహించి పంచకరపాట్లుపడి అరసి రక్షించిన స్వామిభక్తిపరాయణ మహాలక్ష్మమ్మ; పతియగు రాయజగపతితో సహగమన మొనర్చుచు పతి విరోధియగు ఆనందరాజునకు తిరుగని శాపమిచ్చిన మహాపతివ్రతాతిలకమగు సీతమ్మ; రాణివాసపు స్త్రీలందఱికంటె ముందుగాఁ దాను కత్తి కెరయై మానమెఱిగిన స్త్రీత్వమునకు మొదలి పేరైన బొబ్బిలిరాణి మల్లమ్మ; నిండు చూలాలయ్యు మానసంరక్షణార్థమై నిజప్రాణముల ఖడ్గమున కెరచేసిన రమణమ్మ—వీరలఅద్భుత చరితలు ఆంధ్రాభిమానముతో ప్రస్తరింపబడినవి.

2-వ కూర్పు. 112 పుటలు. దళసరి కాగితములు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

## ఆంధ్రరమణీమణులు భా-౨

ఇందు—రణరంగమున వీరవిహారము విరమించి యింటికి వచ్చిన పతికి వీరసందేశమిచ్చి తిరిగి కదనభూమికి పంపి అతనికి వీరస్వర్గమిప్పించిన ఆంధ్ర వీరపత్ని చానమ్మ- మానముకొఱకు, మాటవాసికొఱకు తమ్ము తాను పొడుచుకొని చనిపోయిన తంజావూరి తెనుగురాణి రాజగోపాలమ్మ- యీ రాజగోపాలమ్మ మనుమని చెంగమలదాసుని విక్రాంతిసమయమున అరసి రక్షించి తన ప్రభుభక్తిని ప్రకటించిన దాది - మధుర ఆంధ్రనాయక రాజ్యపాలనమును మహనీయముగ సాగించి దాననిరతిని, ఆంధ్రభాషాభిమానమును అతిశయముగ ప్రదర్శించిన మంగమ్మ- వాందాసాహేబు మోసమునకు గుఱియైన మీనాక్షి- పథ్యముముట్టని పచ్చి బాలెంతరాలయ్యు తన సహగమనోద్యోగము నెఱవేరకపోగా పన్నీరుత్రాగి ప్రాణములు విడిచిన పతిప్రాణ ముత్తమ్మ ప్రజోపయోగమునకై శిశుసహితముగ బలిపోయిన సంగమ్మ వీరల పవిత్రచరిత్రలు గలవు.

దళసరి కాగితములు. 100 పుటలు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

## కేయూరబాహుచరిత్ర

శిల్పము మెరయ మంచనమహాకవి రచియించిన కేయూరబాహుచరిత్ర అను పద్యకావ్యమును ఆధారముగ తీసికొని తేట తెనుగు వచనమున జనసామాన్యముకొఱకు వ్రాయబడినది. పెండ్లాడినవానిని సార్వభౌమునిగా జేయు వరమునొందిన మృగాంకావళియను నొక రాజకన్యను కేయూరబాహువను రాజునకు నతని ధర్మపత్నిచే భాగురాయణుడను నాతని మంత్రి నిజబుద్ధిబలమున వివాహము చేయించిన వృత్తాంత మిందలి ప్రధానకథ. నడుమ నడుమ చక్కని నీతికథలు పెక్కులు గలవు.

గ్లేజుకాగితములు. 90 పుటలు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

## ఆంధ్రరాజభక్తులు

రాజభక్తి యనునది దేశభక్తికి పర్యాయపదముగా రాణించుచుండిన ఆంధ్రదేశపు స్వతంత్రయుగ చరిత్రలలో రాణించు రాజభక్తిశిఖామణులగు విశ్వనాథనాయడు, యాచమనాయడు, అబ్దుర్ రజాక్ లారీ, కరిబసవస్వామి, తిక్కన మంత్రి, మహాలక్ష్మమ్మ, పాపారాయడు, హనుమప్ప నాయడు అను ఎనమండుగురి చరిత్రలను కీర్తించు గ్రంథము.

గ్లేజుకాగితములు. 104 పుటలు.
పోస్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అ 8.

ఆంధ్రభూమి బుక్కుడిపో, వేపేరి, మదరాసు.

# జపానీయుల నడవళ్లు

'జపాన్‌లో ఆడవాళ్లు, మగవాళ్లు బహిరంగంగా చెరువుల్లోనూ, నదుల్లోనూ కలిసిమెలిసి సరిగంగా స్నానాలు చేస్తారు. వారికి అది యెబ్బెట్టుకాదు.'

రచయిత:

'కాశ్యపి'

జపాను సైన్యాలు వీరవిహారం చేస్తున్నాయి. అయితే వీరికి వుత్సాహం శాశ్వతమా లేక తాత్కాలికమా అన్నది ఒక ప్రశ్న. సైనికుల ఉత్సాహము వారి సంసారాలు శోభాయమానంగా వుంటే దినదినాభివృద్ధి పొందుతుంది. కాని వారి కుటుంబాలు తిండిలేక అవస్థలపాలవుతూవుంటే సైనికులకు ఉత్సాహం నిలువదు,

జపాను జనబాహుళ్యముతో కలసి మెలసి తిరిగేవారికి ఇందలి రహస్యం సులభగ్రాహ్యం.

క్లాడి డెన్నీ అనే రచయిత ఒకడు తన జపానుయాత్రానుభవాన్ని ఈక్రింది విధంగా ముచ్చటించాడు.

## అగ్నిపర్వతాలమీద

జపానుప్రజలకు శాంతి అన్నది ఎప్పుడూ లేదు. వారి నివాసమే అగ్నిపర్వతాల మీద. కాగా అగ్నిపర్వతాలు బ్రద్దలవ్యో, భూకంపాలు కలిగో జపానులో ఎప్పుడూ అశాంతిగానే వుంటూ వుంటుంది. ప్రకృతిమాత ప్రసాదించిన అశాంతే కాకండా, జపాను పాలకవర్గం తిన్నగా సూర్యునినోటిలోనుంచి వూడిపడ్డామనే భావంతో తన సహస్రకిరణాలతో జపాను ప్రజానీకాన్ని మలమల కాల్చివేస్తుంటుంది.

జపానులో ఎండాకాలం ఎండలు, శీతాకాలం చలి అపరిమితంగా వుంటాయి. జపాను గృహాలు చాలవరకు వెదుళ్ళతోను, కాకితాలతోను కట్టబడుటవల్ల ఎండనుండి చలినుండి వాననుండి అంతగా రక్షించలేవు. ఎండాకాలంలో అయిళ్ళల్లో ఎక్కువ ఉక్కపెట్టేస్తుంది. కనుకనే జపానులో విసనకర్రలవ్యాపారం విరివిగా జరుగుతుంది.

ఉత్తర చైనాలోవుంటే యూరపుదేశీయులు విలాసార్థం వేసంగిలో జపానుకు వచ్చిపోతూవుంటారు. విలాసార్థం వచ్చిపోయేవారికి బాగానే వుంటుంది. కాని శాశ్వతంగా వుండుకున్న వాళ్ళకే అక్కడ జీవితం చీకాకుగా వుంటుంది. అక్కడి ప్రజలు దీనంగా కనుపిస్తారు.

## పచ్చితేనీరు పానీయం

జపాను ప్రజలలో మరణముల సంఖ్య చైనాలోకన్న తక్కువైనా అమెరికా యూరపు దేశాలకన్నా ఎక్కువే.

ఉబ్బసము, కడుపునొప్పులు మొదలైన రోగాలు విరివిగా వున్నాయి.

వాళ్లు సాధారణంగా బియ్యపు అన్నము తింటారు. పచ్చి తేనీరు త్రాగుతారు. పచ్చితేయాకునీరు మొదటలో రుచిగా వున్నా తరువాత నీరసపెట్టేస్తుంది. అందుచేత వారు జీవచ్ఛవాల్లావుంటారు. మొత్తంమీద జపానులో సామాన్యజనులకు జీవితాలపైరోత గావుంటుంది. ఇహలోకంలో సుఖంలేకపోవడంవల్ల పరలోకములోనైనా సుఖముంటుందన్న పిచ్చినమ్మకంచేత ఆత్మహత్యలు చేసుకొంటూ వుంటారు. అందుకనే జపానులో ఆత్మహత్యవల్ల చచ్చిపోయేవారి సంఖ్య హెచ్చు. ఈమధ్య ఒక జపాను సైన్యాధికారికూడా ఆత్మహత్య చేసుకొనే చనిపోయినట్టు వార్తవచ్చింది. అందలి సత్యాసత్యాలు ఎట్లావున్నా ఆత్మహత్య చేసుకోవడమనేది నిర్భాగ్యులగు జపానువారలకు ఒక ఆటవంటిది.

## తెల్లజాతులంటే ద్వేషం

జపానువాడు లోపల ఎంత బాధపడుతున్నా బయటకు బాగావున్నట్టు నటిస్తాడు.

గురుశుశ్రూషలో జపాను యువకులు అగ్రగణ్యులు. తమ ఇంగ్లీషు పండితుల ఇండ్లలో అడ్డమైన చాకిరీలు చేసి విద్య నేర్చుకుంటారు.

జపాను జనబాహుళ్యంలో తెల్లజాతులంటే ఒకవిధమైనద్వేషభావంవుంది.

ఇంగ్లీషువారు ప్రమాదకరమైన ఆశయాలు ప్రచారం చేస్తారని వారి అనుమానం. శ్వేతజాతులలో అవినీతి ప్రబలంగావుందని వారి విశ్వాసం. కాని నిజం చూస్తే జపానులో వున్నంత అవినీతి మరి ఎచ్చటా లేదు అనాలి. కాని ఆ అవినీతిని కప్పిపుచ్చడంలో జపానువారు అతినిపుణులు.

జపానులో ఆడవాళ్ళు, మగవాళ్ళు బహిరంగంగా చెరువుల్లోను, నదుల్లోను కలిసిమెలసి పరిగంగాస్నానాలు ఆడతారు. వారికి అదియెబ్బెట్టుగావుండదు.

## జపాన్‌లో ముద్దులు

జపానువారికి బహిరంగంగా ముద్దుపెట్టుకోవడం తప్పు. సినీమాలలోకూడా ముద్దులుపెట్టుకునే సీనులు కత్తిరించేస్తేనేకాని సెన్సారుబోర్డువారు ఒప్పరు.

అన్యదేశీయులు వచ్చి తమ ఆలుబిడ్డలను చంపేస్తున్నారని జపానువారి క్రోధం. కాని వారి సామెతలనుబట్టి చూస్తే పొరుగింటివాని భార్య రంభవంటిదంటారు. పొరుగు చూపులు ఎక్కువన్నమాట. పొరుగుచూపుల తరువాత ఉంపుడుకత్తెలు. అటుతరువాత అర్ధాంగులు. అంటే వారు గురువిందగింజవంటి వారన్నమాట.

జపానువారి ఆచారాలకు, యూరపుదేశీయుల ఆచారాలకు హస్తిమశకాంతం తేడావుంది. కాగా ఒకరినొకరునమ్మరు. వారికి కలవదు.

భారతదేశంలో ప్రయాణీకులు మూటలను కావడిబద్దలకు యిరువైపులా కట్టుకొని పోయినట్లే జపాను ప్రయాణీకులుకూడా పోతారు:

జపాను స్త్రీలు తమ బిడ్డలను వడికట్టులో పెట్టి తమవీపులకు గాని ప్రక్కలకుగాని కట్టుకుంటారు. చాలామంది స్త్రీలు పొంకోళ్ళు ధరిస్తారు. వాళ్ళ వస్త్రాలు ఒకవిధమైన చమురువాసన వేస్తూవుంటాయి.

## రైళ్ళలో వారి తీరు

జపానురైళ్ళు, కార్లు అన్నీ ఏకండీగా వుంటాయి కాని విభాగాలువుండవు. రైలు ఎక్కగానే తలపాగా, నడుంకట్టు అన్నీ విప్పేస్తాడు. అవన్నీ భద్రపరచుకొని కూచుంటాడు బండి కదలగానే జోగుతాడు. ఆజోగులో ప్రక్కనున్నవాడు ఎవడైనాసరే లెక్కచేయకుండా అతనిమీద జోగి నిద్రపోతాడు. అంటే బస్తాలు నెట్టువేసినట్టుగా వుంటాయి రైలుపెట్టెలు.

వాళ్లను లేపితే తినడం ప్రారంభిస్తారు. అంటే లేపినవానిని కాల్చుకు తినడమేకాదు. బొక్కిసాలో భద్రపరచుకొన్న తినుబండారాలను పైకితీసి తింటాడు.

ఆ తినేటప్పుడు ఒక విధమైన ధ్వని లేగుతుంది. ఆధ్వని పూరపందులు చేసే ధ్వనిలా వుంటుంది. అది చాలా అసహ్యంగా వినుపిస్తుంది.

## జపాన్ స్త్రీల పడుచుదనం

పెద్దలతో మాటాడే సందర్భంలో నోటికి చేయి అడ్డంపెట్టుకొని మరీ మాటాడతారు. జపాను స్త్రీలు రైళ్లలో పడుకోరు. ఎంత బద్ధకంగావున్నా సరే వారు అట్లా కూచునే కునిపాట్లు పడతారు. కాని కొంత వయసు ముదిరి ముసలమ్మల్లో చేరిపోయాక బరి తెగించేస్తారు. వారు ఎప్పుడుకాని భర్తకు ముందుగా నడవరు. భర్తను అనుసరిస్తారు. సామానులను భార్యలే మోస్తారు. జపాలు స్త్రీలు భర్తలు నిద్రించిన వెనకనే పడుకుంటారు. భర్తలు మేలుకొనకపూర్వమే మేలుకొంటారు. అనువయిన భర్త దొరకడమే వారిభాగ్యంగా తలుస్తారు. సరిఅయిన భర్త సంప్రాప్తమయితే వారు దేవలోకం చూచినట్టు సంతసిస్తారు.

జపానులో ఇండ్లకు వరస నెంబర్లు వుండవు. ఒక వీధిలో ఏదేనా యిల్లు కనిపెట్టాలంటే చాలాకష్టతరమైనపని. ఆవీధికి చెందిన పోలీసుస్టేషనుకు పోయి పోలీసువానిని అడిగితే వాడు బుర్రగోక్కుంటూ తనవద్దనున్న పుస్తకాన్ని తిరగవేసి పాత్రిపట్టలేకపోతే ఒక కప్పుటీయిచ్చి యింకో పోలీసు స్టేషనికి పంపేస్తాడు. ఇదిఅంతా మామూలు కాలంలో జరిగేవిషయం.

ఈ యుద్ధకాలంలో జపాన్‌లో యువకుడనేవాడు కనుపించడు.

## యుద్ధకాలపు జపాన్

గీషాబాలికలతో (భోగంపిల్లలతో) కలకల్లాడే టోకియోలోని పెద్ద పెద్ద హోటళ్లు యిప్పుడు పాడు దేవాలయాలు మాదిరిగా వున్నాయి.

సైనికభటుల సందడులు తప్ప మరే సందడులు కనుపించవు.

చైనాయుద్ధంలో నే ప్రజలలో దరిద్రదేవత తాండవిస్తూవుంటే బ్రిటిష్ బుల్‌డాగ్‌తో పోరాటానికి దిగిన వెనుక మరీ హేయంగావుంది జపానువారినిత్యజీవితం.

తినుటకు తిండి పండుటకు కొంపాకూడా కనుపించడంలేదు. చైనాయుద్ధంలో చాలావరకు కార్లు మూలపడుటవల్ల ప్రయాణానికి తగిన సౌకర్యాలుకూడా లేవు. ఆహారపదార్థాలు అమ్మే ప్రదేశాల్లో తొడతొక్కిడిజాస్తీగావుంది.

సెకండుహాండు వస్తువులకు యిప్పుడు ఎక్కడలేని గిరాకి తగిలింది.

జపానులోని ఎనిమిది పెద్ద కళామందిరాలు, సుమారు నూటికిపై మించిన విశ్రాంతికేంద్రాలు (క్లబ్బులు) ఇప్పుడు మూసుకు కూచున్నాయి.

జర్మన్ ప్రోపగాండాసినీమాలకుతప్ప యితర ఫిలిములకు తావులేదు.

నాటకమందిరాలుమూల్గుతూన్నాయి.

యుద్ధసామగ్రి తయారుచేసే కర్మాగారాలలోని కార్మికులకువచ్చే డబ్బు చాలడంలేదు. ప్రజలలో కొనుగోలుతనం క్షీణించింది. వర్తకం పడిపోయింది.

# పటిక ప్రయోజనం

వ్యాసకర్త:
డాక్టరు
రామస్వామి నాయుడు

ఇంగ్లీ: ఆలమ్, అల్యూమిన్; హిందీ, బెంగా: ఫిట్కరీ ; పంజా : పట్కరీ ; కాశ్మీ: ఫట్కర్; అరవ : పటికారమ్, మల: చిన్నిక్-కారమ్ ; మలే : ట్వాస్; కన్న: పటికారా ; మరా : పటికార్ ; సింహ: సినకారమ్; బర్మ: కెవోఫిన్;

గుణము :—రక్తబంధిని, వ్రణహారి మరియు కఫహారి.

మోతాదు 5-10 గ్రెయినులు వాడవచ్చును రోజుకు 30 గ్రెయినులు వాడవచ్చును. మించి ఎక్కువగ వాడినచో వమనకారి: పటిక పొడిగాని, లేక నీళ్ళలో గాఢముగా (ఎక్కువగా) పటికను కలిపిన పటికనీటిని గాని (saturated solution) వాడినచో దెబ్బల, గాయముల రక్తము ఆగును. మానెడు కురుపుల అంచుకు మించి పెరిగెడి దుర్మాంసమునకు, కండ్ల రెప్పల లోపైపు పెరిగెడి మాంసపు మొలకలకు (Trochwa) పటికయు మైలతుత్తము కలిపి పొంగించెడి కణికల వాటిమీద తడిజేసి ఒత్తినచో మిగుల గుణకారి: రసికారెడి కురుపులకు చెవులోని చీమునకు : 4 గ్రెయినులు పటిక, వెలిగారము (Borax) నాలుగు గ్రెయినులు, నీళ్ళు ఒకఔన్సు. బెదరిన ముక్కు రక్తమునకు పటికపొడి పీల్చినచో రక్తము ఆగును లేక కొంచెము నీళ్ళలో ఎక్కువ పటికను చేర్చి, సన్నబట్ట పీలికల తడిపి ముక్కులోకి ఎక్కించినచో రక్తము కట్టును. మర్మస్థానములనుండి వచ్చు రక్తమునకు పెద్ద బట్ట పీలికల వాడవలయును. కండ్ల కలకలకు: పటిక 4 గ్రెయినులు, నీళ్లు ఒక ఔన్సు. స్త్రీల తెల్లచీర (కుసుమ వ్యాధికి)—20 ఔన్సుల నీళ్ళకు ఒక డ్రాము పటికపొడి. స్త్రీలయు, పురుషుల శగరోగములకు (Gonorrhoea) పటిక మూడు గ్రెయినులు, నీళ్లు ఒక ఔన్సు : పిచికారీతో వాడవలయును. బైటికి వచ్చిన ఆసనమునకు (Prolapsse of the rectum) మొలలజబ్బులకు (Piles) 6 గ్రెయినుల పటికను ఒక ఔన్సు నీటిలో కలిపి ప్రతి విరేచనానంతరము ఆసనద్వారము లోనికి పిచకారితో ఎక్కించినచో మిగుల గుణకారి: పండ్లసలుపుకు, నోటిపుండ్లకు, రసపట్లనోటికి మరితర నోటిపూతలకు గోరువెచ్చనిపటిక నీటి పుక్కిలింత లాభకారి: మరియు దంతధావనమునకు వాడుకొను ఏపండ్లపొడియందైనను పటికను చేర్చినచో పండ్లు గట్టిపడును.

(Internally). లోపలికి: అతిసారమునకు (Dysentery) మరియు గ్రహణిరోగమునకు (Dysentery) 5-10 గ్రెయినులు రోజుకు 5 గ్రెయినులు రెండుసార్లు లేక మూడుసార్లు. మందు చీటి: పటికారము 5 గ్రెయినులు, కాచు 5 గ్రెయినులు, లవంగపట్ట 5 గ్రెయినులు: అన్నియు కలిపి ఒకపొడి: రోజుకు మూడు సార్లు. అతిసారమునందు, మరియు సన్నిపాత దోషజ్వరములకు (Typhoid Fever) పాలు 20 ఔన్సులు, పటికపొడి 2 డ్రాములు కలిపి కాచి విరిగిన పాలను వడియగట్టి (Milk Whey) ఆపానీయమును, ఆహారమును రోగికిచ్చినచో ఆహారమునకు ఆహారము మరియు పై రెండు వ్యాధులకు ఔషధము.

వాంతి రూపమున జీర్ణకోశము నుండియు, దగ్గురూపమున శ్వాసకోశముల నుండియు పడెడు రక్తము కట్టుటకు పై సుదహరింపబడిన పటిక కాచు లవంగపట్ట మందుచీటి లాభకారి. అదియే చిన్నపిల్లలకు వయస్సును బట్టి తేనెలోగాని, ఓమమునీళ్లలోగాని వాడవచ్చును: కోరింతదగ్గులకు, చిన్న పిల్లలకు 2 గ్రెయినుల పటికను తేనెలో కలిపి యిచ్చుచుండవలయును:

పైపూత:—దెబ్బలచే కందిన భాగములకు, దీర్ఘరోగములచే పరుండియున్న రోగుల పిఱుదులయొక్కయు వీపుయొక్కయు భాగములు ఒత్తిడిచే కంది, ఒత్తిడి కురుపులు (Bed Sores) కాబోవు చోట్లకు మందుచీటి: పొంగించిన పటిక 30 గ్రెయినులు, ఒక కోడిగ్రుడ్డు తెల్లసొన బాగా కలిపి ఆభాగములకు పట్టువేసి కాచినచో గుణకారి.

ఉబ్బసపు దగ్గులకు:—పటిక లాభకారియని గ్రంథములందు వ్రాయబడియున్నది. వైద్యులు అనుభవముగా వాడిచూడవలయును. రోజుకు 10 మొదలు 30 గ్రెయినులవరకు లోపలికి వాడవచ్చును.

తేలుకాటుకు: పటిక కణికను నీళ్ళతో తడిజేసి కుట్టిన స్థలములో బాగా రుద్దినచో గుణకారి.

వ్రణహారిగ వాడుకొనుటకు మలాము: పటిక, కాచు, కొబ్బరినూనె, మైనము వీటిని పైపూత మలాముగా తయారు జేసికొని వాడుకొనవచ్చును.

## విజ్ఞాన విషయాలు

ఇంగ్లండులో బ్యాంకు సెలవుల్ని ఏర్పాటుచేసినవాడు సర్ జాన్ లబ్బాక్.

... ... ...

ఆస్ట్రేలియాకు దక్షిణాన్ని ఇప్పుడు టాస్మానియా నామంతో వున్న దీవికి పూర్వం వాన్‌డీమాన్స్ ల్యాండ్ అనే పేరు వుండేది.

... ... ...

యూరపియన్‌ల త్యాగరాజు అనతగ్గ బీథోవెన్‌కు బ్రహ్మచెముడు. తాను వ్రాసిన కీర్తనల్నే తాను వినలేకపోయేవాడు.

... ... ...

యాంబర్‌గ్రిస్ అనే సుగంధద్రవ్యం తిమింగలాల పేగులనుండి లభ్యమవుతుంది.

... ... ...

జర్మన్ పార్లమెంటుకు రీచ్‌స్టాగ్ అనీ, యుగోస్లావియా పార్లమెంటుకు స్కుప్‌ష్టినా అనీ, డెన్మార్కు పార్లమెంటుకు రిగ్స్‌డాగన్ అనీ పేరు.

... ... ...

శాన్‌ఫ్రాన్‌సిస్కోనుండి యోకహామాకు 4764 మైళ్లు. న్యూయార్కునుంచి శాన్‌ఫ్రాన్‌సిస్కోకు 3000 మైళ్లు.

... ... ...

చైనాలో ఐదుకోట్లమంది మహమ్మదీయులు వున్నారు. చైనాలోని పశ్చిమోత్తర భాగాల్లో వారు విస్తరించి వున్నారు.

... ... ...

విద్యుచ్ఛక్తి సహాయంతో వెలుగు, వెచ్చతనం కలిగిస్తే తేనెటీగలు ఒక్కొక్కపట్టులో పదిహేడుపౌనుల ఎక్కువ తేనెను ఉత్పత్తి చేస్తాయి.

## మహావాక్యరత్నాలు

దాని ఫలితాలు మనకు తెలియకపోవుగాక! లేదా ఆ ఫలితాలు మనం అనుకున్న తీరుగా కలగకపోవుగాక! ఎవరి విధాయక కృత్యాన్ని వారు చేయడం నిరుపయోగ విషయంకాదు.

—*Mrs Gaskell*

* * *

జయము, అపజయము అనే పదాలకంటె న్యాయం అనే పదం చాలా పెద్దది.

—*C. S. Tanner*

* * *

మనఅభివృద్ధితూర్పునుంచి కాని, పడమటినుంచికాని, దక్షిణాన్నుంచికాని, ఉత్తరాన్నుంచికానిరాదు. దానిని నిర్ణయింపవలసిన వాడు దేవుడు. ఆయన ఒకణ్ణి దింపివేసి మరిఒకణ్ణి పైకి ఎక్కిస్తాడు.

—*Psalms*

## చమత్కారచాటువులు

వైద్యుడొచ్చినమాత్రాన వణుకుపుట్టె,
సంచివిప్పిన మాత్రాన చలవగమ్మె,
మందు యిచ్చిన మాత్రాన మాటలణిగె,
ఓరి, నీచేతిమాత్ర, వైకుంఠయాత్ర.

—యస్. వి. రత్నం చెట్టి

* * *

వేముకన్న విషము వెత్తిపుచ్చ ధరిత్రి
పాముకన్న విషము ప్రథమశాఖ
నాభికన్న విషము నల్లని బాపడు
విశ్వదాభిరామ వినుర వేమ.

* * *

చాదస్తం చలచిత్తంచ
బుద్ధిహీనంచ యాచకః
మాతృద్రోహీ గురుద్రోహీ
వెల్నాటేచ స్వభావకః.

## మద్రాసు మనది

1938 సెప్టెంబరులో వెలువడిన ఆంధ్రభూమి మద్రాసు ప్రత్యేక సంచిక కాపీలు ఇంకను కొద్దిగ మిగిలివున్నాయి. కావలసినవారు రెండు అణాల తపాల బిళ్ళలు పంపితే పొందగలరు.

ఈసంచికలోని ప్రధానవ్యాసాలు :

1. మద్రాసు మహానగరం ముమ్మాటికి మనది.
2. దానికి చెన్నపురి అనేపేరు మనం ఇచ్చింది.
3. మద్రాసు అనే పేరుకూడా మనం ఇచ్చిందే.
4. జార్జిటవున్‌ని ఆదిలో తెలుగుటవున్ అనేవారు.
5. మద్రాసు మొదటి పోలీసు అధికారి ఆంధ్రుడు.
6. మద్రాసులో మొదటి దుబాసి, మొదటి వర్తకుడు ఆంధ్రులే.
7. మద్రాసు మనదిగా చేసిన మహానీయులు.
8. మద్రాసు లేని ఆంధ్రరాష్ట్రము తల లేని మొండెము.
9. మద్రాసు ఇరుసుమీద ఆంధ్రుల భవిష్యచక్రం ఆధారపడివుంది.
10. మనది కానినాడు మద్రాసు భావి గతి అధోగతి.
11. మద్రాసుపోతే మన నిధులు పోతాయి.
12. మద్రాసులో ఆంధ్ర,అరవ విభేదం ఈనాటిది కాదు.

ఆంధ్రభూమి, వేపేరి, మదరాసు.

# పిగిలిపిట్టకై పలువరింత

రచయిత:

పోట్లూరి వెంకటేశ్వరరావు

ఉపవశన శైల మూలకు దిగువ కళకళలాడుతూ చిన్న పల్లె ఒకటి కానవస్తుంది. మధుర మంజుల వసంత పవనం దాని నాలింగనం చేసికొని దాని పర్ణశాలల్ని కుసుమ సౌరభంతో నింపివేస్తుంది. లోయ నుండి పరుగెత్తుకుంటూవచ్చి హిమశీతల ప్రవాహములు దాన్ని బాహు పాశంలో బంధించి ఉంచుకొన్నయ్...ఆరమణీయ ప్రదేశంలో నిరంతరం ఒక స్నిగ్ధసంగీతం వినవస్తుంది. దాంట్లో పిగిపిట్టల కలకలనాదంకంపతరంగాల నుత్పన్నంచేస్తుంది...

కుంకుమవర్ణపు దాడిమ కుసుమముల మనోహరచ్ఛాయ సంధ్యారుణ కిరణముల వలన శోభాయమానమగుతోంది. తార దాని క్రిందనే శిలాఖండంమీద కూర్చొని గులాబిగుంపును చూస్తోంది... దాంట్లో చాలా పిగిలిపిట్టలు కులకుల కూస్తున్నయ్. సమీరునితో దాగుడుమూతలాడుతూ ఆకాశాన్ని తమ కలరవం వల్ల మాధుర్యమయంగా చేసి వేస్తున్నై...

తటాలున తార తన ముసుగు తీసివేసింది...ప్రకృతి ప్రసన్నురాలై నవ్వింది...గులాబి దళంలో తార వదనం శశాంకునిలాగు శోభితమైయుంది. మకరంద భరిత ముఖములతో నీల భ్రమరద్వయము ఆ గులాబి కుసుమముమీది నుండి ఎగిరిపోలేకున్నది...భ్రమరముల రెక్కలు నిష్పందములై ఉన్నయ్ ... ముండ్ల పొదల్ని లక్ష్యంచెయ్యకుండా పిగిలిపిట్టలు వాటిలోదూరడం. ఎగిరి పారిపోవడం ... తారతన్మయురాలై చూస్తోంది...

ఆమె సఖి జలేఖా రాకవలన ఆమెయొక్క ఏకాంత భావన భంగమై పోయింది...

'తారా! నీచేతులమీద కూర్చునే ఆ పిగిలి పిట్ట ఇప్పు డెక్కడా కనిపించడంలేదేం ?' అని తన ముసుగు తొలగిస్తూ జలేఖా అడిగింది.

దీర్ఘముగా నిట్టూర్చి తార బదులుచెప్పింది: 'శీతల ఋతువులో...గుంపుతో మైదానంవైపు వెళ్ళింది...వసంతుడు వచ్చాడు... నా పక్షి రాలేదు...'

'ఇవన్నీ హిందూదేశంలో చాలాదూరం వెళ్తాయని విన్నాను నిజమేనా తారా ?'

'ఔను చెలీ...స్వతంత్ర విహారం వాటికి మిక్కిలి ఇష్టం... ఆ జాతి స్వాతంత్ర్యదేవత నుపాసిస్తుంది...'

'అయితే ఉంగరములు తిరిగియున్న నీ నీలిముంగురుల పాశంతో దాని నెందుకు బంధించుకోలేదు నువ్వు ?'

'ఆ విహంగమును... నా పాశములు...'

'సరే...మంచిది. వస్తుంది... భయపడకు. నే నింటికి వెళ్తా.'

తార తల ఊపింది...

జలేఖా వెళ్ళిపోయింది...

* * *

పర్వతాకాశంలో సంధ్య తన రంగు రంగుల వసనములు పరుస్తోంది.

విహంగములు కలరవంచేసుకుంటూ పంక్తులు తీర్చి సఘన కుంజముల దిశకు మరలుతున్నయ్ ...వాటి కోమల పక్షములవలన అనిలునిలో పొంగు పుట్టుకొస్తోంది. ...సమీరుడు ఉండుండి ఉరుకులురికి తన తరంగాలనానికి అంధకారాన్ని లాక్కొస్తున్నాడు ... గులాబి కుసుమములు అధికాధిక

సౌరభమును కోల్పోయి పచ్చని దుప్పట్లో ముఖము దాచుకోజూస్తున్నయ్... తార ఆశాపూరిత దృష్టి అంధకార తిరస్కృతమై కనురెప్పలలో దాక్కోసాగినది...

జాగ్రదావస్థలో ఉండీ తార ఒక స్వకల్పన చేయ నారంభించినది...

'హిందూదేశపు భాగ్యవంతమగు ఒక నగరులోని సందులో యువకుడొకడు వీపుమీద మూట వేసుకొని తిరుగుతున్నాడు. పరిశ్రమ, నిరాహారముల వలన వదనం వివర్ణమై ఉంది. ఆయాసంవల్ల అతడొక గడపముందు కూలబడ్డాడు. ఏదైనా అమ్ముకొని ఆ దినమునకు జీవనోపాది సంపాదించుకొనవలెననే ఉత్కంఠ అతని దయనీయశబ్దములలో కాన్పిస్తోంది, కాని గృహస్థు డంటున్నాడు...!

'అరువిస్తే ఇవ్వలేకపోతే మూట ఎత్తుకో తెలిసిందా?'

'నాకు... అరువివ్వగల సమర్థత...లేదు...'

'అయితే అవసరంలేదు...'

తార ఈకల్పననుండి ఉలికిపడి లేచింది... యాత్రిక సమూహంతో తన సంపత్తిని కట్టుకొని కైబరు గిరిసంకటమును భావనాబలంవల్ల పాదాక్రాంతము చేయసాగినది...

అతని సమస్త వస్తువులకూ మూల్యమిచ్చి అతనిని భారత విముక్తునిగ చేయగల ధనాఢ్యునిగా... ప్రతిభారతీయ గృహస్థుణ్ణి చేయవలయునని ఆమె సంకల్పం...కాని!

సరళ హృదయ తార నిస్సహాయురాలు...తండ్రి ఒక కొండ సర్దారు...క్రూరుడు...తార తన తల వంచుకుంది...ఏదో యోచింపసాగింది...

సంధ్య ప్రభుత్వ మంతరించింది ...కలరవ మాగిపోయింది...తార శ్వాసంలాగే పవనుని గతి అవరుద్ధమైపోయింది...

ఆమె వీపు శిల కానుకొన్నది..

దాసివచ్చి ఆమెను ప్రకృతస్థురాలుగ చేసింది. 'అమ్మగారు పిలుస్తున్నారు. పదండి గోరింకవచ్చింది'

* * *

కాలస్రవంతి సాగిపోయింది... తార ఇప్పుడు ధనికుడగు ఒకసర్దారుకు...సతి...! వాగు ఒడ్డున తార ఉపవనకన్యక దరహాసంచేస్తోంది...వసంతుని పవనం ఒక్కొక్క చెంప పెట్టుకు వందలాదినుమ సుందరుల నేడ్పిస్తోంది ... మధుధార స్రవింపసాగుతోంది ...పిగిలి పిట్టలు వాని నిర్దయలకు ఆక్రందనముసేయ మొదలిడుతున్నయ్... తార అంతా సహిస్తూ...కూర్చొని ఉన్నది. సర్దారుముఖము త్సాహపూర్ణమై ఉంది.

ఏది ఎలాగున్నా... అది ఒక సురుచిర సుప్రభాతం...

దుర్బలతను ప్రదర్శిస్తోన్న గుంటలుపడ్డ కళ్ళతో...పొడుగాటి యువకుడు వీపుమీద మూటవేసుకొని ఎదుటికి వచ్చి కూర్చున్నాడు. తార అతన్ని చూచింది... అతడెవరివంకా చూడడంలేదు...తన సామాను విప్పి చక్క బెడుతున్నాడు...

సర్దారు ప్రేయసికి బహూకరించాలని గాజుగిన్నెలు కాశ్మీరు సామాన్లు ఏరుతున్నాడు.

తార మౌన పయోధిలో మునిగి ఉన్నది...ఆమె హృదయ కాననంలో...కపోతములు (కండరనము చేస్తున్నయ్...

సర్దారు ధర అడిగాడు.

'నేను విక్రయించడంలేదు... కానుకగా సమర్పిస్తున్నాను ... ఈ సామగ్రి నేను కోరి తీసుకున్నాను... వీటిలో మూల్య మే

## తేలుమందు

గుప్పెడు దురదగుండ ఆకు తీసుకొని వచ్చి తేలుకుట్టినచోట వేసి కట్టకలెను. ఆకు నలుప నవసరములేదు. 15 నిమిషములలో దిగిపోవును. కుట్టినచోట బాధ, దురద, మంటలువగైరాలు వుండవు పావుగంటలో దిగనయెడల ఇంకా 10 నిమిషములు వుంచినను ఫరవాలేదు. ఈ మందు నా స్వానుభవముమీద 5 సంవత్సరములనుండి వాడుచున్నాను.

—కనకమేడల వెంకటసుందరం.

కాదు ... హృదయంకూడా ... లగ్నమైఉంది...ఇవి ఖరీదు కమ్మబడేవి కావు...'

'ఐతే నాకక్కర్లేదు. తీసుకుపో- ఎత్తుకో.'

'తీసుకెళ్తాను...అమిత ఆయాసంతో ఇచటికి రాగలినాను... కొంచెంసే పాగండి... మొగమూ సేతులూ కడుక్కుంటాను ...' అని యువకుడు తన ప్రఫుల్ల నేత్రాన్ని కనపడనీయకుండా ... లేచి వెళ్లాడు...

వాగువైపుకు వెళ్లాడేమోనని అనుకున్నాడు సర్దారు. ఆలస్యలయింది...కాని...!

అతడు రాలేదు...

గాఢ ప్రహారమునూ ... నిర్మమవ్యధనూ...భరిస్తూ హృదయం చేతుల్తో అదిమిపట్టుకొని తార గులాబి కుంజములవంక చూడసాగింది...కాని...!

ఈమె అశ్రుపూరిత నయనములకేమీ గోచరించడంలేదు ... 'ఏమిటి చూస్తున్నావ్' అని ప్రేమతో వీపుమీద చెయ్యివేసి సర్దారడిగాడు.

'నా పెంపుడు పిగిలి ఒకటి శీతకాలంలో... హిందూదేశంవైపుకెళ్ళింది...అది వచ్చి ఈ ఉదయం అగపడింది...దగ్గరకు రాగానే దాన్ని పట్టుకోబోయాను... కాని ... అది...అటు...పర్వతముల వైపుకు పారిపోయింది...'

తారస్వరంలో కంపముంది.

అయినా ఆశబ్దాలు చాలా స్పష్టంగా వెల్వడినయ్.

సర్దారు నవ్వాడు.

'పుష్పములకు పిగిలిపిట్టల అన్వేషణమా! ఆశ్చర్యం!'

*బిసాతీ తన వస్తువులు వదలిపెట్టి వెళ్ళాడు.

తిరిగి రాలేదు.

తార బరువుమట్టుకుదింపుకుంది.

కాని...!

మూల్యమివ్వలేదు...

# ఆమె ఎవరో చెప్పగలరా?

ఆమె నిరుపేద కుటుంబంలో పుట్టిన అదృష్టరాసి. ఆమె సొగసు సోయగము అంతా ఆ వారచూపుల్లోనే వుంది. ఆమె ఒక మెరుపుతీగ. ఒక అమృతమూర్తి. తారాలోకంలో సాటిలేని వేగుచుక్క. ఆమె కళాప్రియుల కొక దేవత.

ఆమెబాల్యం శోభా దరిద్రాణం. అది ఒక సానపట్టని రత్నం. అమృతమునకు అంటులేదు. పావన గంగాజలానికి మాలిన్యంలేదు. ఆ నాటి ఆమె జీవితశోభ నాచుచే కప్పబడిన కమలమునలె గుప్తమయింది. ఆమె అధరామృతాన్ని పోతుటీగలు అనేకం చవిచూచిపోయాయి. కాని ఆమె హృదయము వికసింపలేదు, ఆమె గుప్తధనాన్ని ఎవరు కొల్లగొనలేకపోయారు. పద్మము పద్మినీపతి ప్రభ సోకినప్పుడు మందహాసాంచిత ముఖారవిందము యగును కాని గండు తుమ్మెదల ఝుంకారములకు హడలి సడలించునా ?

ఆమె హృదయము గంభీరమైనది. ఆమె వికసిత వదనారవిందమును చూడవలెనని అనేకమంది వాంఛ. అది సులభసాధ్యము కాని పని.

రత్నము సానపట్టినంత మాత్రాన రత్నమునకున్న అమూల్యమైన విలువ సానపట్టినవారి కేల కలుగును ?

ఆమెదర్శనభాగ్యానికి వేనవేలు జనం నిత్యం తహతహ పడిపోతారు చకోరపక్షుల్లాగ.

ఆమె అతిలోక లావణ్యవతి కాపోయినా ఆ చల్లని చూపులు తమమీద ఒక్కసారి పడితేచాలు. జీవనముక్తి కలుగుతుందని ఆశ. ఆ వెర్రిబాగుల నాగమ్మని చూడాలని మహాఋషులు తపిస్తారు, మహారాజులు విలపిస్తారు.

ఆమె పొట్టిగా పండిన జామిపండు రంగులో వుంటుంది. ఆధునిక వనితాలోకానికి ఆమె ప్రతిమ ఒక ఆదర్శప్రాయంగా వున్నా ఆమె నిరాడంబరజీవి. ఎన్నడు కాని షోకులుచేయదు, బయట కనుపించినప్పుడు మసిపూసిన మాణిక్యంలా వుంటుంది. సౌందర్య పోషణకు ఆమెను చూచి దిద్దుకునే కులాంగనలు కూడా ఆమెనుచూచి సిగ్గుపడతారు. సహజ లావణ్యవతికి అలంకారాలెందుకు ? ఆచక్కని కురులు ఆచల్లని చూపులు ఆ హంసగమనం. ప్రజానీకానికి సమ్మోహనాస్త్రాలు.

ఆమె కటాక్షమాలికలకు గురి అయిన ప్రతివ్యక్తీ ఆ సుందరి అంగసౌష్టముచూచి నిశ్చేష్టుడైపోతాడు.

ఆశోభనాంగి కటాక్ష వీక్షణాలకు తపించి తపించి ముక్తిపొందని పలుగాకులు కొందరు ఆమెపై ధ్వజమెత్తుతారు. వారు వీరననేల. ఆమెను చూస్తే నేడు బ్రహ్మకు కూడా పుడుతుంది.

తన్ను విడిచిపెడతాడేమోనన్న భీతిచేతనే రూపొందిన వాణికూడా ఆమె అంటే ఈర్ష్యపడి ఆమె ఒక పెంకిపిల్ల అని చిత్తమొచ్చినట్టు ఎత్తిపొడుస్తోంది. ఆమె ఎవ్వని అండ చూచుకొని 'సుశీలవతి' అని ధనముతోపాటు యశమును ఆర్జిస్తున్నదో ఆవ్యక్తిని ఆమెకు అందకండా చేయడానికి కూడా కొందరు క్రూరులు ప్రయత్నించి విఫలమనోరథులైనారు. ఆమె నిరుపమానమైన ఇల్లాలు.

ఈ రత్నాలమూట మా తెలుగుతల్లి ప్రియపుత్రిక. ఆ అమృతకలశాన్ని ఎవ్వరెన్ని కారులు కూసినా ఆమె శిఖ పువ్వాడకండా రక్షించుకోకలదు తెలుగుతల్లి. ఆ అదృష్టశాలి ఎవ్వరో మీరు చెప్పగలరా ?

"ఇందిర"

---

## ఉక్కుపరిశ్రమ తేడాలు

ఆస్ట్రేలియాలో ఉక్కు పరిశ్రమ ప్రారంభమై రెండేళ్ళైంది. ఐనా అక్కడ ఇప్పుడు ఏడాదికి రెండు మిలియన్ల ఉక్కు తయారవుతూ వుంది. ఇండియాలో ఉక్కుపరిశ్రమ ప్రారంభమై ముప్ఫయిఏళ్లైంది. ఐనా ఇక్కడ ఏడాదికి ఒకటింపావు మిలియన్ల ఉక్కుమాత్రమే ఉత్పత్తి అవుతూవుంది.

# ప్రబంధాలలో హాస్యం

ఈ హ్యూమర్ అనేది స్వతహాగా మనిషిలో ఉంటేనేగాని, వ్రాతలో రాణించదు. హాస్యం చెప్పడం ప్రతీవాడికీ చాతవుతుందా? అదిగాక, యెదటివాడు మనమాటలకు నవ్వేడంటే, కేవలం ఆమాటల్లోగల హాస్యరసం గ్రహించి, సంతోషించి, నవ్వేడని అనుకోకూడదు. ఏకారణంచేతనైనా, నవ్వవచ్చును. ఏమంటే, నవ్వు నాలుగువిధాలు. నవ్వొచ్చి నవ్వడం- నవ్వకుంటే బాగుండదని నవ్వడం- నవ్వాలికాబోలని నవ్వడం యేడవలేక నవ్వడం.

సాధారణంగా యితరులకు నవ్వుకలిగించేది మనలో ఉండే తెలివితక్కువతనం, అందుకనే, పసిపిల్లలు పిచ్చివాళ్లు మనని సులభంగా నవ్వించగలరు. కాని, పిచ్చిపిచ్చి వ్రాతలవలన పాఠకులను మెప్పించి, నవ్వించాలని యత్నించడం, కవికి గొప్ప కాదు. మన పూర్వకవుల పుస్తకాల్లో హాస్యరసం అంతగా కనిపించకపోవడానికి యిదేకారణం కావచ్చును. శోకం, భక్తి, శృంగారం- ఇలాటి రసాలు ప్రతిగ్రంథంలోనూ కనిపిస్తాయి. కాని, హాస్యరసం అనేది యే పుస్తకం పిండినా, పదిబొట్లు రాలవు. కథలో హాస్యరసం యిమడ్చలేక, మనకవులు కొందరు వేరే ఒక విదూషకుని నిర్మించి, ప్రబంధాల్లోనూ, నాటకాల్లోనూ దూర్చారు.

ఇంగ్లీషుకవుల వ్రాతల్లో స్ఫురించే హాస్యరసం యింతకంటే యింపుగానూ, నాజూకుగానూ ఉంటుంది. ఇటీవల మన ఆంధ్రకవులుకూడా తక్కిన రసాలతోపాటు, హాస్యరసానికి సహితం కొంతగౌరవం యిస్తున్నారు. కాని కేవలం హాస్యరసమే ప్రధానంగాగల గ్రంథాలు చాలా అరుదు.

ఇందుకు కారణం యేమిటి? మన కవులకి నవ్వించడం చాతగాకనా? లేక, చాతనయికూడా యీ రసంలో ఉండే మహత్తును గ్రహించలేకనా? లేక, 'నవ్వు నాలుగు విధాలచేటు' అన్న పెద్దలవాక్యం యెరిగి, నవ్విస్తే పాపం అనే ఊహచేతనా? కవులకే కాదు, యెవరికైనాగాని ఒకర్ని యేడిపించడంకంటె, నవ్వించడమే ఘనత, కాని, యేడిపించడం సులువని తోస్తుంది. అందుకనే, కొందరుకవులు ఒకర్ని యేడిపించి, ఆమూలంగా మరొకర్ని నవ్వించాలని యత్నిస్తారు. దీనినే వెకలిహాస్యం, వెక్కిరింత అంటారు.

పరిశుద్ధమయిన హాస్యరసం అనేది, తేటగా, శుభ్రంగా, తియ్యగా అమృతంవలె ఉండాలి. అంతే కాని, అరవ కాఫీలాగు నల్లగా చేదుగా కొందరికి, ఘాటుగా రుచిగా కొందరికి, ఉంటే లాభం లేదు. అందరికీ ఒకే విధమైన రుచి, ఆనందం కలుగజేసేదే నిజమైన హాస్యం.

హాస్యం అంటే కొందరు అర్థంచేసుకోలేక, మోటసరసంలోకీ, వెక్కిరింతలోకీ దిగుతారు. భాగోతులు, హరికథలు చెప్పేవాళ్లు, సురభినాటకాలలో హాస్యగాడివేషం వేసే వాళ్లు- వీళ్ళంతా యిదేమచ్చు. ఇంగ్లీషుగ్రంథాల్లో హ్యూమరనీ, బఫూనరీ అనీ, ఐరనీ అనీ, సెటైరనీ, హాస్యం అనేకవిధాలుగా గోచరిస్తుంది. మన తెలుగు పుస్తకాలలో యిన్ని రకాలు కావు సరేసరి కదా, మెచ్చుకోతగిన రకం యేదీ కనిపించదు.

కొంతవరకు వీరేశలింగంపంతులుగారి పుస్తకాల్లోను, చిలకమర్తి వారి పిట్టకథలలోను, పానుగంటి పంతులు నాటకాల్లోను, హాస్యరసం అక్కడక్కడ చిలికి వున్నది. ఒక్క 'కన్యాశుల్కం' మాత్రం హాస్యరసగ్రంథాలలో సుప్రసిద్ధమై ఉన్నది. అప్పారావుపంతులకు హ్యూమరనేది స్వతహాగా అలవడినట్లుంది. ఆమోస్తరుగా కడుపు చక్కలయేటట్లు నవ్వించే పుస్తకం తెలుగులో కాదు సరేకదా, మరేభాషలోనైనా వున్నదా అని సందేహించవలిసొస్తుంది. వెంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్ర నాటకంలో కూడా హాస్యరసం మెండుగానే స్ఫురిస్తుంది. కొంతకాలంక్రిందట బుద్ధిరాజు ఈశ్వరప్పపంతులుగారు రేవేవో చిన్నచిన్న హాస్యగ్రంథాలు ప్రకటించియుండిరి, మంచి తమాషాగా ఉండేవి.

కొందరిప్పుడిప్పుడు యేవేవో పిట్టకథలు ప్రహసనాలు టిట్‌బిట్‌సూ వ్రాస్తున్నారు. కాని అవి లిటరేచర్‌లో యెంతమట్టుకు నిలుస్తాయో నిలకడమీదకాని తెలియదు.

తెలుగు పుస్తకాలలో హస్యామరనేది కొరతగా వుండడం విచారకరమైన సంగతేకాని అంతకంటే విచారకరమైన సంగతేమిటంటే, కవులు హాస్యం వ్రాయబోయి అసందర్భాలు రాయడం! నవ్వుతాలు నాజూకుగా ఉంటేనే ముద్దు. లేకుంటే రోత. ఆనందించి నవ్వుకోడానికి బదులు అసహ్యంవేసి కవిని తిట్టాలనిపిస్తుంది. జ్ఞానంలేని పసిపిల్లలకు బూతుమాటలు నేర్పి నవ్వుకొనే మూర్ఖులుంటారా అనుకో కూడదు. అంతకంటే అన్యాయంగా వుంటుంది కొందరుకవుల హాస్యం.

మా పురాణం శాస్త్రిల్లుగారితో ఒకనాడీ హాస్యరసంగూర్చి ప్రస్తావిస్తే ఆయన కాళిదాసు శ్లోకాలేవో చదివి అర్థంచెప్పడం ప్రారంభించాడు. నాకే సంస్కృతంలో యేమీ ప్రవేశం లేనందున 'అయ్యా, శాస్త్రిగారూ, తమరు చదివిన తెలుగు గ్రంథాలలో యేవైనా ఉదాహరణలు తీసి చదివిన తెలుగుగ్రంథాలలో యేవైనా ఉదాహరణలు తీసి చదవండి' అని అడిగాను.

కొంతసేపాలోచించి, ఆయన యేవేవో తమాషాపద్యాలు చదివేడు. కొన్ని కొంచెం మోటుగాను, కొన్ని కేవలం పచ్చిగాను, కొన్ని నిజంగా సరసంగానూ, ఉన్నాయి. 'ఇవే గ్రంథంలోవిచెప్మా' అని నేను తటపటాయిస్తున్నానని అనుకొని, ఆయన, "ఇవి చాటువులండి. మన పూర్వకవులు చెప్పినవే అంటారు. కాని యేపద్యం యేకవి చెప్పిందో, ప్రమాణం చూపించగలరా అంటేమాత్రం, కష్టం. ఉప్పెనగా నవ్వొచ్చేవన్నీ తెనాలికవివే అంటారు. ,నానా సూనవితాన వాసనల, అన్న ముక్కుమీద పద్యంలాగ. తిమ్మన్న దేనా అంటే' తిమ్మన్నది కాకూడదా, అనుకోవాలి' అని సమాధానం చేప్పేడు.

"చాటుపద్యాల మాటకేం లెండి. పొడుపుకథ పద్యాలు, ఆశుధారలు, సమస్యలు పూర్తిచేస్తూ చెప్పిన పద్యాలు, పాండిత్య వైరంచేత కవులు ఒకరి నొకరు తిట్టుకుంటూ వ్రాసిన పద్యాలు, ప్రభువులు సత్కరించనప్పుడు కసిచేత వాళ్ళను దూషిస్తూ, చంద్రరేఖా విలాపంవంటి పుస్తకాలు రాసిన కవుల మోటుపద్యాలు, 'దీని భావ మేమి తిరుమలేశ, అన్న పద్యాలు,- వీటిమాట నే నడగలేదు. ఉత్తమ గ్రంథాలని మీరు భావించే పుస్తకాలలో ఉండే చమత్కారమైన పద్యాలు తీసి చదవండి పకపక నవ్వించేవిగాని చిన్నచిన్న చిరునవ్వు కలుగజేసేవి కాని ఉత్తమగ్రంథాలలో నవ్వుతాలుంటాయా అండి" అన్నాడు శాస్త్రుర్లు.

ఎందుకుండకూడదు. ఇంగ్లీషులో షేక్‌స్పియరనే మహాకవి గొప్పగొప్ప విషాదాంతనాటకాలలో సహితం హాస్యరసం కురిపిస్తాడు అని చెప్పేను.

నవలలు నాటకాలు వీటిలో కవికి ఉండే స్వేచ్ఛ ప్రబంధాలలో ఉండదు. పురాణాలలోను ప్రబంధాలలోను హాస్యరసం యిమడడానికే చోటుండదు. ఎంతసేపు కవనగాంభీర్యం అనేది పదగుంభనలోను, ప్రకృతివర్ణనలోను, విశదపడాలి.

"అంతేనా? కథాకల్పనో? అందులో కవికి వోల్లమాలిన స్వేచ్ఛవుందిగా' అన్నాను.

మనవాళ్లు మంచి మంచి కథలు కల్పించుకొని ప్రబంధాలు రాశారనుకున్నారా యేమిటి? మన తెలుగుకవులు కథకోసం యెన్నడూ శ్రమపడి యెరగరు."

"అయితే తెలుగులో స్వతంత్రగ్రంథాలే లేవనా తమ అభిప్రాయం" అని అడిగాను.

"ఇంచు మించు అలాగే చెప్పవలసి వస్తుంది. నాగరంలో లేని కథయేదీ మన కవులు యెత్తుకోలేదు, పురాణాలయితే నేమి, ప్రబంధాలైతేనేమి, అన్నింటికీమూలం సంస్కృతం."

"కావచ్చును. కథయేదైనా, రచనావిధానంలో కవి చమత్కారం చూపవచ్చును కదూ!"

"నిజమే లెండి. కాని మన పురాణగ్రంథాలన్నీ భక్తిప్రధానమైనవి. కాబట్టి చొరవచేసి, కవులు హాస్యరసం వాటిలో యిరికించలేను, నవ్వొతాలు రాస్తే, దైవభక్తి అనేది నిలుస్తుందా?" అన్నాడు శాస్తుల్లు.

"అదికాదు. దేవుళ్ళనీ, దెయ్యాలనీగూర్చి వ్రాసేటప్పుడు హాస్యం చెప్తే, బెడిసికొడుతుందని భయం చాత కాబోలు! పోనీ, ప్రబంధాలమాట చెప్పరేం?"

"అవైనా, అన్నీ ఒకేమాదిరిగా ఉంటాయి. కథయేదైనా, కట్టుబాట్లు అధికం గనుక, ఒకకవిని చూసి యింకోకవి, ఆకవినిచూసి మరోకవి, అందరూ ఒకటే ఫక్కీ అవలంబించేరు. అంచాతనే, మీరు కోరిన చమత్కారపద్యాలు యెక్కడో కాని కనిపించవు. ఒరిజినాలిటీ లేనప్పుడు హాస్యానికి అవకాశంయేదీ?" అని శాస్తుల్లు తలవూపుస్తూ, పెదిమె విరిచాడు.

"స్వతంత్రించి, కొత్తదార్లు తొక్కి, చమత్కారంగా రాసిన కవులు లేరన్న మాటా?" అని నవ్వుతూ అడిగాను.

"లేరండి. అందుకు కారణాలు లేకపోలేదు. ఇప్పుడు చూశారా, ఒక ప్రబంధం చెయ్యాలంటే మన కవులు ముఖ్యంగా ఆలోచించిన దేమిటి' ఇది యేరాజుకు అంకితంగా చెప్పాలి అని. అంతే, కథ కల్పించుకోవలసిన అగత్యంలేదు. పురాణాల్లోను, సంస్కృత నాటకాల్లోను, కావలసినన్ని కథలున్నాయి. ఇక రచనావిధానం పూర్వులు స్థిరపరిచేవుంచారు. కొన్ని యిష్ట దేవతాపద్యాలు, గురుస్తుతి. ఆవెనక కథాప్రారంభం. అనగా, పురవర్ణన– రాజుగారి కీర్తిప్రభావము– వసంతఋతు వర్ణన– వేట– అడవిలో ఉండే చెట్లు, మృగాలు, వీటితాలూకు జాబితా– రాజుగారు అలసి విశ్రమించబోయేసరికి సమీపంలో కిన్నెరగానం వొళ్లు పరవశం చేసేటట్లు వినరావడం– పిదప దేదీప్యమాన మైన స్త్రీరత్న దర్శనం– మోహం– తాపం– విరహం– యుద్ధం– గాంధర్వవివాహం– భరతవాక్యం.

"ఈవిధంగా యేదో గాథ తీసుకొని అంకితం యివ్వబోయే రాజుగారిని అందులో నాయకుణ్ణి చేసి పొగడి మెప్పించి భూమో పుట్రో బహుమానంగా సంపాదించడం, మన కవుల ముఖ్యోద్దేశం. యమకం, చమకం, ప్రాస, ద్వంద్వార్థపదాలు, చాంతాళ్ళలాటి సంస్కృత సమాసాలు, అచ్చ తెలుగు పదాలు, వీటితో తమ పాండిత్యం వెల్లడిచేస్తూ, ఛందోదోషాలు లేకుండా, కట్టుబాట్లు దాటకుండా, రాజుగారికి కోపం రాకుండా గ్రథం తయారుచెయ్యాలి. కథలో సందర్భం లేకపోయినాసరే, వర్ణనలేవీ విడిచిపెట్టకూడదు. అనగా పురవర్ణన, ప్రాతఃకాలవర్ణన, సంధ్యాకాలవర్ణన, చంద్రోదయవర్ణన, చంద్రదూషణ, వసంతఋతువర్ణన, తుమ్మెదల శృంగార గానం, మన్మథదూషణ, నాయికా నాయికుల రూపవర్ణన,(నఖశిఖపర్యంతమును)–సంభోగవర్ణన."

"అయితే, శాస్తుల్లుగారూ, ఇన్ని రాయడానికి ఓపిక వుందిగాని, మన కవులకు శాస్త్ర హాస్యమరుకే అవకాశం లేకపోయిందా?" అని మెల్లగా నవ్వుతూ అన్నాను.

"అట్లా అంటే, నే నేం చెప్పేది? అవకాశం లేక కాదు. శృంగారరసమే మన కవులకు ప్రధానంగా కనిపించింది. పోషకులచిత్తవృత్తి ననుసరించి కదా వాళ్లు కృతులు చేయవలసి యుండెను? అయినా, హాస్యరసం కూడా కొన్ని కొన్ని ప్రబంధాలలో అక్కడక్కడ చిలికి వున్నది."

"ఒకటిరెండు పద్యాలు ఉదాహరణకింద చదవండి" అని శాస్తుల్లుగారిని హెచ్చరించేను. ఇది చిత్తగించండి:—

అన్నులమిన్న యొూర్తు వసుధాధిపనందను( జూడ(గోరి వా
ల్గన్నుల( గుంకుమంబు, నొసలన్ వకజ్జలమున్ ధరించి,లో
నెన్న(గరానితత్తఱము హెచ్చ(గ నచ్చుగ రాజపద్ధతిన్
గ్రన్నగవచ్చె!–దాని(గని కామినులందఱునవ్విరొక్కటన్.

ఇది 'రసికజనమనోభిరామము'లోనిదండి, కూచిమంచాయన కవిత్వం చాలా సరసంగాను, హాయిగాను ఉంటుందండి."

"అది నిజమేకాని, యీపద్యంలో నాకేమీ సరసత కానరాలేదండి. వర్ణనలో అతిశయోక్తి యెంతవున్నా, అది కొంచెం స్వాభావికంగా ఉంటేనే కాని, రాణింపులేదు." అన్నాను.

"పోనీ, ఇది చూడండి. హాస్యం, శృంగారం రెండు రసాలు స్ఫురిస్తాయి. ఆ ప్రబంధంలోనిదే :

ఉవిద యొక్కతె వెలికిల నుండి, నీటఁ
దేలుచో, నొక్క రాయంచ తివిరి తమ్మి
మొగ్గ యంచును దాని చన్మొగడ వొడువఁ
గలికి యలికి, యొగించుక యులికిపడియె."

"శాస్త్రుల్లుగారూ, హాస్యంలో యేదైనా విపరీత భావం స్వాభావికంగా స్ఫురించాలి. ఈ పద్యంలో హాస్యరసంపాలుకంటె, శృంగార రసం పాలు జాస్తీగా వుంది. కొంచెం మోటైనా, పద్యం బాగుంది." అనాను.

ఆమాట నేరకపోయి, నోరుజారి, యెందుకన్నానా అనిపించింది, చివరకి. ఇట్టి పద్యాలే కాబోలు నేను చదవమన్నానని, అనుకొని శాస్త్రిల్లు వరస పెట్టి, శృంగార నైషధంలో నుంచి రాగవరసతో చదవడం ప్రారంభించాడు. నాకు నవ్వొచ్చి, ఆపుకోలేక, ముఖం పక్కకుతిప్పి, చిరునవ్వు నవ్వుకున్నాను. పద్యాలలోవుండే స్వారస్యం గ్రహించి, ఆనందిస్తున్నానని భావించి, ఆయన మరీ ఉత్సాహంతో చదివేడు పద్యాలు.

'నేత్రము నేను, జీరయును నేత్రము; చీరకు నాశ్రయింపఁగా
బాత్రతగల్గె, నాకు నిటఁ బాత్రతలేదని నామసామ్యపై
చిత్రికతంబునన్ బలిమిఁ జేకొనినట్టులు రాజుదృష్టి యా
త్రిజయకన్యచారుకటిచక్రము నూరుయుగంబు దూఱెనన్.

గంధజలపూరితంబులై కమలముఖుల
కరములం గన్న మణిహేమ కలశములకుఁ
జెలువ మగు భీమకన్య చన్నులకు నోడి
దాస్యమున నీళ్లు మోచుచందంబు గలిగె.

అల్లన యొకర్తు వగ్గు కృకలాసముఁ జేరఁగఁ దెచ్చి, వంచనన్
నలునకుఁ గుంచెపట్టు నెలనాగ పదద్వయమధ్యమంబునన్
నిలిపినఁ గాలు ప్రాఁకనది నీవియసీమకుఁ దోడిభామినుల్
గలకల నవ్వ నూడ్చెనది, గట్టినపుట్ట ముపాయశూన్యతన్.

అవ్వలి దిక్కు మోముయిప్రియంబుననొండులకోడమున్చ్చటల్
ద్రవ్వుచు నొక్కకోమలిపరాకుననుండఁగ, ధూర్తుఁడొక్కరుం
డివ్వల వచ్చి వంచనమెయిన్ నునుమించు మెఱుఁగుటద్దమున్
నవ్వుచుఁ బట్టె దానిచరణంబులకు న్నడుమైన మేదినిన్.

ఓమె యేమె యి దేమేమె లేమ యేమె
మేఘపుష్పంబు లేవంచు మేలమాడ,
మేమె మేమెలు దఱచయ్యె మేలు మేలు
మేక మేకన సభవారు మిగుల నరిగి.

ఉష్ణశీతాన్నకబళంబు లొకఁడు నూపఁ
బవలొ రాత్రియొ గడగూడ నవసర మని,
దాని కుత్తర మొక లతాతన్వి యిచ్చె
నధరబింబంబు విఱిచి సంధ్యాగమ మని.

మదగజరాజకుంభముల మచ్చరికించు చురోజకుంభముల్
గదసి కలంతమేరయును గైకొనియున్నది యెల్లవారికిన్
విదితముగాక, నిట్టితరి నీ చెలిడెందమునందు నేమియుం
గదలక మాకు నుండ నవకాశము లేదుగదే కళావతీ?

రమణిహృదయంబునను మహారాజ నీవు
గరిమ నిచ్చేసి యుండిన కారణమున
దీని వక్షోరుహంబు లాలోన నుండ
నెడము లేకున్న మరికదా, వెడలె వెలికి?

శాస్త్రిల్లుధోరణి అంతకంతకూ ఉద్రేకంతో చెలరేగుతూ వుండడం కనిపెట్టి, యిక ఊరుకుంటే లాభంలేదని, "ఇక చాలును లెండి......అబ్బా, ఎన్నిపద్యాలు కంఠోపాఠం చేశారు!" అన్నాను.

"సావకాశంగా కూచుంటే యింకా యితరకవులను వినిపిస్తాను.

"ఎందుకు లెండి? ఇట్టి పద్యాలు కావు నేనడిగినవి. మీ పూర్వకవులకందరికీ ఒక నమస్కారం. వాళ్ళజోలి మనకొద్దు హాస్యం అన్నా, శృంగారమన్నా, వాళ్ళకు విపరీతభావన లుండేడివని తోస్తుంది" అన్నాను.

కొంతసేపు నావేపు నిర్ఘాంతపడి చూసి, "అదేమిటి అట్లా సెలవిస్తున్నారు" అన్నాడు శాస్త్రిల్లు.

ఇక ఈయనతో వాదించి లాభంలేదని తోచింది.

—తా తా కృష్ణమూర్తిగారు, బి.ఏ.ఎల్.టి.

# రామారావు కళారాధన

[ఈ వ్యాసం 26-3-1942 న రాజ్మహేంద్రవరంలో జరిగిన శ్రీరామారాయ వర్ధంతి సందర్భమున చదువబడినది. కీర్తిశేషుడు దామెర్ల రామారావుని గురించి, అతని కళని గురించి ఈ వ్యాసమంత సునిశితంగా ఇంతవరకు ఏ వ్యాసమున్నూ అవలోకించి వుండలేదు. కావున చిత్రకళాభిమాను లందరూ ఈ వ్యాసాన్ని తప్పక పఠిస్తారని నమ్ముతున్నాము.

—సంపాదకుడు.]

రచయిత:

## కవికొండల వేంకటరావు, బి.యే., బి.యల్.



దామెర్ల రామారావు నాకు పెత్తల్లి కొడుకు. మేమందరము గాడిచర్లవారి దౌహిత్రులము. మా మాతామహుల పేరు రామయ్యపంతులు గారు. ఆయనపేరే శ్రీ రామారావుకు ఉంచినారు. మా మాతామహుడు ఆజానుబాహువు మనిషి. మనీషీకూడాను. 'మాతామహుడు' అని నేను ఒకప్పుడు కొన్ని పద్యాలు రచించాను. అందులోని ఒక్కపద్యం చదువుతూ మీ మనఃఫలకంమీద చిత్రించుకున్నారా ఆయన ఎంతటి హుందాగల పురుషవరేణ్యుడో తెలుస్తుంది.

"చెంగుల పింజెరాఁ జలువచేసిన తెల్లనిపంచెగట్టి పై
నంగరకా ధరించి నిడుపంచు జరీతల పాగజుట్టి పై
నింగొనబైనచేల మొకనీటుగ వైచుక రచ్చనున్న ని
న్నుంగని యెవ్వరంచను కొనుంగద పై యధికారి యేనియున్."

80 యేండ్లు సుమారు జీవించి 1915 లో కాలంచేసినాడాయన. శ్రీరామారావు వేసిన ద్రోణుడు బొమ్మ చూచినప్పుడల్లా నాకు మామాతామహుడు జ్ఞాపకంవస్తూంటాడు. మా మేనమామలు, ఈరాజ్మహేంద్రవరం, వారి తలిదండ్రులతోపాటు అమలాపురం తాలూకా వాకలగరువునుండి వచ్చివేసినవారై మా అందరి విద్యాబుద్ధులకు అంతో, ఇంతో కారకులైనారని నానమ్మకం. వారిలో కడసారపు ఇప్పుడున్నాతడు శ్రీ గాడిచర్ల సత్యనారాయణగారు తన నలభై ఎనిమిదోఏట నాట్యం ప్రారంభించి అందు ప్రావీణ్యత సంపాదింప యత్నిస్తూవున్నాడూ అంటే కళపట్టున మాతల్లి వంకవారికున్న పరాకాష్ట ఎట్టిదో ఊహించుకొనుడు.

అయితే మా అందరిదీ ఒక యెత్తు, రామారావుది ఒక యెత్తు. రామారావు కళాశాలావిద్యార్థి యెన్నడూ కాడు. కాకపోయినప్పటికీ స్థానిక కళాశాలా ప్రధానాచార్యులైన శ్రీ కూల్డ్రీయొక్క మన్నన చిన్ననాటనే పొందగలిగాడు.

కూల్డ్రీపేరు మీకందఱకూ పరిచయమైనపేరే. ఆయన్ని మీలో అందఱూ కాకపోయినా కొందరైనా చూచియుండకపోరు. అతడూ మనలాంటి పౌరుడే అన్నట్టు సంచరించాడు ఈ పురవీధుల్లో ఈ నదీతీరాన్ని. చిత్రిస్తూవుండేవాడు మనచుట్టూవున్న ప్రకృతి. అదేకాలంలో ఒకానొక వ్యక్తి—పేరెందుకు లేండి—తాను జనరంజననటుడవడమే కాకుండా మనోరంజనంగా నాటకపు తెరలు తయారుచేస్తూ వుండేవాడు — చింతామణీ నాటకశాలలో అనుకుంటాను. హాస్యరసమైన పాటలుకూడా పాడుతూ వుండేవాడు. నాకూ బాగా జ్ఞాపకం. 'లోటా' అని ఒక టుమ్రీ విసరి గెంతుతూ తేకుతూ ఓరాత్రి కడుపుబ్బ నవ్వించాడు. తాను వేసిన రంగుతెరల రంగస్థలంమీద ఆవ్యక్తి నిలబడి సొంత నటనాకౌశల్యము చూపిస్తూవుంటే పిల్లకాయల్లో అనేకమందికి ఆ పోకడగా కుంచె ప్రాముదామని, ఆ సోకుగా రాగం విసరుదామని యూహలు పుట్టేవి—నేటి టాకీపాటలు విన్నంతలో, టాకీ ఆటలు కన్నంతలో కొత్త అభిరుచులు ఎత్తుకుపోతూన్నట్టు—అయితే నాటక

శాల పోకడలు లయలు అనుకరించడమనేది నిజమైన చిత్రలేఖనాభిమానమూ, సరియైన పాత్ర పోషణ బాణీయూ అనేది నిగ్రహమున్న యువకుల్లోను, ఉత్సాహవంతులైన పెద్దల్లోను చర్చింపబడుతూ వుండేది. చర్చ తెగని సందిగ్ధావస్థలో విశాలమతియైన కూల్డ్రివంక కందఱి దృష్టి తిరిగేది.

కూల్డ్రి అప్పటికప్పుడే విద్యార్థులచే ఆదర్శప్రాయంగా నాటకాలు వేయిస్తూ వాటి కనుగుణ్యంగా తెరలు వ్రాయిస్తూ వుండేవాడు.

చవకబారుకుక్షింభరులచే కాకుండా అనాసక్తయోగదృష్టిగల తరుణదత్తులచే తనకు వలసిన రీతిని జూలియస్ సీజరు నాటకానికి తెరలు వ్రాయించాలని కూల్డ్రి తలపోశాడు. ఆ సందర్భంలో బాలకుండగు మనరామ్ ఉపకరించాడు. “I was surprised at Ram’s mastery of the technique of Scene-painting.” అని తన వ్యాసంలో సూచించాడు, రామారావుని గురించి వివరాలు తెలుసుకున్నాడు—శ్రీదామెర్ల వెంకట్రావుకు అనుజన్ముడని, అతని మేనమామలు ఫలానా అని, ఈ అందరిలోనూ లలితకళా సురభిళం వంశపారంపర్యా వచ్చుచున్న చిహ్నమే అని గుర్తించాడు. వినండి ఏలా వెల్లడించాడో తన పరిశోధనావిధానం: “Ram's gifts and works alike can be better understood in the ligh of a knowledge of the relavent gifts and interests of his relations and early associates. Artistic gifts, graphic and visual, are evidently prevalent in Ram's family. Some work which I saw by a maternal uncle of his, seemed to me very delicate and remarkable in the barren artistic environment of his time. Ram's sister's work is well known and it will, I hope, be better known.” సిస్టర్ అంటే దిగుమర్తి బుచ్చి కృష్ణమ్మగారు. మా మేనమామ బొమ్మలు వేయడాన్ని గురించి ఓనాడు నేనున్నుప్రశంసించియున్నాను, ‘అంబుదంబు’ అనే ఖండకావ్యంలో—

‘జాముప్రొద్దుండగాగళాశాలవిడిచి
గౌతమీతీరమందున గౌతుకమున
బడవలను బండ్లజూచుచు నడుచుచుండ
వంతెనకు బైనింగనబడుపర్వతముల
మేతమేయంగ దిగు నాలపోతసంగ
వెల్లవన్నెలతో నీవు విశ్రమింప
గాంచితి నేను, మఱియును గాంచి వ్రాసె
మేలురంగుల పటము నా మేనమామ.’

శ్రీ దామెర్ల వెంకటరావు ‘ఫ్రీహేండు’లో ప్రవీణుడు.

వంశచిహ్నమైన యీ లలిత కళకు ఆంధ్రత్వం ఆపాదించడం మేలనిపించింది కాలం గడచినకొద్దీ. తెనుగు కవులు, తెనుగు చిత్రకారులు, తెనుగు శిల్పులు, తెనుగు గాయకులు అనే ప్రత్యేకత కోసం ప్రతియువకుని మనస్సు ఉఱ్ఱూట్లూగసాగింది. ‘ఆలాంటి ఆశయమే, మీ అందఱిలోనూ వున్నట్టయినా తెనుగులో పద్యాలు వ్రాయండి, తెనుగు దేశంలోవున్న కొండల్నీ నదుల్నీ ఆకాశాన్ని లోకాన్ని గమనించి చిత్రాలు గీయండి’ అనే ప్రబోధ ఊరూవాడా వ్యాపించిపోయింది. ఆప్రబోధతోపాటే ఒక పరామర్శకూడా జరుగుతూవచ్చేది. తెనుగు కవిత్వము ఇతఃపూర్వములేదా అని- రవివర్మ వేసిన సీత సావిత్రి చెట్టుయ్యాలా, చేతిచెంబు పీటికంటె ఎవరు బాగా వేయగలరు అని.

ఈ ప్రబోధలయొక్క అవరోధలయొక్క దోసందులో వేళ్లునాటుకొన్న అభిరుచియే శ్రీరామారావు మున్నగువారియొక్క చిత్రకళాభిరుచి.

రవివర్మకన్న భిన్నరుచి కనబఱచి మెప్పువడయవచ్చుననేది వంగీయ భంగిమం వొకప్రక్క ఘట్టిగా చాటుతూ వుండడంవల్ల తాముకూడా ఏదైనా ఒక కొత్తదారి త్రొక్కడంలో తప్పులేదని, వరిస్తే కీర్తికాంత తమన్నికూడా వరించవచ్చునని, తమకృషి సత్కాళగా పరిణమిస్తే ప్రపంచంలో స్థిరమైన సేవచేసి తీరుతుందని మన యువకులు దృఢచిత్తులైనారు.

వీరి నూతనోత్సాహానికి, ఒక వంక శ్రీభాష్యకోల్రావుగారిని పంపించి శ్రీపిఠాపురం మహారాజులుంగారున్ను, ఒక వంక శ్రీరామారావుని వెళ్ళేటట్టుచేసి శ్రీ కూల్డ్రివారున్ను మంచి దోహదం సమకూర్చారు. ఎక్కడకు? బొంబాయికి.

వీరిరువురున్ను బొంబాయిలో తమ సాధన పూర్తిగావించుకొని యింటికి తిరిగి వచ్చేటప్పటికే కనుక ఆంధ్రనాయకు లాంధ్రరాష్ట్రం సంపాదించి వుండి వుంటే, శ్రీభాష్యకోల్రావుగారో, శ్రీ రామారావో ఆంధ్రచిత్రకళా కళాశాలకు అధ్యక్షులుగా ఉండి మనకు వెలుగుగొల్పి యుందురు. ఆట్లుజరుగు భాగ్యం లేకపోయింది, రాజకీయంగా ఆం

ధ్రుల అభివృద్ధి గొప్పతోకగానే నిల్చిపోయింది- నాటికీ, నేటికీ.

అప్పుడు రామారావులో ఒక విధమైన జిజ్ఞాస బయలుదేరింది. తెలుగు ఏ రెండుమూడు వందలో వేతనం పుచ్చుకుంటూ చెన్నపురిలోనో, కలకత్తాలోనో, బొంబాయిలోనో వుండి వారి అధికారదర్పాలు, వారి వేషభాషలు, వారి విపరీత సిద్ధాంతాలు అనుకరించి ఏదో మెదడులేని యంత్రంమాదిరి అయిపోవడమూ లేక ఆంధ్రదేశంలో కొన్నాళ్లు తాను వుండిపోయి తన నూతనానుభవమంతా ఆంధ్రుల పరంగా యథేచ్ఛను వినియోగించడమా అనే జిజ్ఞాస అతనిలో బయలుదేఱింది.

నా దతనికి చావడిలో స్నేహితుడై చేదోడు వాదోడుగా వుండి అతనితో కూడా రంగులు కలుపుతూ వచ్చిన ముఖ్యకళావేత్త ఒక్కడే అని నా నమ్మకం. అతడే శ్రీ వరదా వెంకటరత్నం. ఇప్పటికీ తన్మయుడై శ్రీరామారావుని మఱువకుండా చిత్రకళ నేమరకుండా ఏపూటా కనిపిస్తూ వుంటాడు ఈనగరంలో. శ్రీ వెంకటరత్నం 1934 లో వేసిన 'గౌరీశంకర్' లోని సౌమ్యత, 1942 లో వేసిన 'విరహిణి'లోని తీవ్రత మీరు తప్పక గ్రహింతురుగాక అని నామనవి.

చావడి విడిచిపెట్టి శ్రీరామారావును లోపీఠిలోగిట్లో అవలోకిస్తిమా- ఆరోజుల్లోనే రామారావుకు వివాహమైంది, శ్రీ దిగుమర్తి, శ్రీనివాసరావుగారి రెండవ కుమార్తె 'దామెర్ల సత్యవాణి' అనే పేర బరగుతూవున్న కళాకోవిదయే అతని సహచరిణి. నేను ఇరువంకలవారినీ బాగా ఎరుగుదును. భార్యలోకళ తాను చూఱగొంటూ భార్యను తన కళ అపురూపంగా అలవరచీవాడు ఆ యౌవనంలో అమృతహేళయుడు శ్రీరామారావు.

ఇప్పుడు మనం చూడగలుగుతూవున్న అతని గొప్ప చిత్రములన్నింటిలోనూ ఆమె ప్రతిబింబించి తీరింది. ఆమె ఆంధ్ర పురంధ్రికావడంవల్ల తద్వారా రామారావు బొమ్మల్లో ఆంధ్రత్వం వెల్లివిరిసింది: అతడే గనుక ఒక పార్శీ యోషామణినిగాని, యొక ఘూర్జరాంగననుగాని చెట్టపట్టివుండినట్టయినా ఈ తెనుగుతెన్ను శ్రీరామారావు కళలో గమనించడానికి మన కవకాశం వుండకపోయాది.

ఈ దృగ్పథాన్ని శ్రీరామారావు కళ ఆకళించడముకు తగు సావకాశం ఏకొద్దిమందికోగాని కలిగియుండదు- మనయొక్క బయటి జీవనానికి మన యొక్క ఇంటి జీవనానికి మధ్యనో పెట్టని సాంఘికపు గోడ వుండడంచేత.

అయినప్పటికీ 'పుష్పాలంకారం' చూస్తూ విస్తుపోని పురజనుడులేడు. 'నందిపూజ' కంటూ ఆశ్చర్యపోని రాజమహేంద్రవర నివాసిలేడు. మొదటిది మన పేరటాంద్ర సౌయ్యం, తియ్యం వెయ్యనోళ్ళ ముచ్చటిస్తూంది. రెండవది మన మార్కండేయాలయంలోని నందివిగ్రహాంకు పులకరెత్తేనా అన్నంత బ్రహ్మానందం గొలుపుతుంది.

ఇంకా చాలాచాలా చిత్రాలున్నాయి అనుకోండి. వివరించి చెప్పడం అంటూవస్తే వినునిందే అనుకోండి, కాని వక్తిఅయిన వాడు కాలం గమనించవద్దూ?

రామారావు తన జీవితకాలంలోనే గొప్ప మెట్టు అందుకున్నాడు. ఈ పట్నంలో జరిగిన మొదటి చిత్రకళాప్రదర్శనం సందర్శించే భాగ్యం నాకు కలిగింది. అది ఆంధ్రులపాలిటి అపూర్వ సుముహూర్తము. గంగోలీ కళాశాలి తన హిమాలయ- సూర్యోదయ చిత్రాన్ని పంపించాడు ఆప్రదర్శనానికి. ఇంకా ఎంద రెందఱివో పాంచాల, కర్ణాట, మహారాష్ట్ర, వంగ, ఉత్కల! మన చుట్టుపట్ల! మంచి బొమ్మలు వచ్చాయి. ఇప్పుడు ఎ. ఆర్. పి ఆఫీసువున్న మహాభవనంలో జరిగింది ఆ ప్రదర్శనం, బహూదివ్యంగా!

అటువంటి ఘనమైన చిత్ర సంఘటనము నాడు జతపడ్డానికి ఎవరు కారకులు? శ్రీరామారావు. అతను ఇతర రాష్ట్రాలలో పలుకుబడి సంపాదించి లలితకళలందు చతురులైనవారితో ఆసేతు హిమాచలం సహవాసంచేసికో సాహసించాడు- అప్పటికప్పుడే. అప్పటికప్పుడే అజంతాగుహలు చూచాడు. భువనేశ్వరాలయాలు తిలకించాడు. పాపికొండలలో పయనించాడు.

ఏతత్ప్రదర్శన ఫలితంగా ఆంధ్రుల చిత్రకళ విజయభేరీమోగింది అన్నా, రాజమహేంద్రవరపు చిత్రకారులు చిత్రలేఖనమునలో క్రొంగ్రొత్తరాజబాట వేశారన్నా ఏమాత్రం అతిశయోక్తిలేదు. వారి 'వింబిల్డన్' విఖ్యాతి ఆంధ్రులందరిదీ, భారతీయులందరిదీ అని ప్రపంచం అనుకొనేటట్టు చేసింది.

వంగీయుల గీర కన్నడుల వొయ్యారం రెండూ ఇమిడివున్నాయి రామారావు కళలో! పాశ్చాత్యుల రంగు, ప్రాచ్యుల రాగం రెండూ మిళితమైయున్నాయి రామారావు కళలో! వీనవ్

సౌందర్యం, రతీదేవి సత్యం సాక్షాత్కరిస్తాయి రామరావు కళలో !

అతడు గీసిన గూడు గీతలు అన్నీ ఇన్నీ కావు. ప్రకృతిని చూచి గీశాడు. ప్రేయసిని చూచి గీశాడు. అతడు వేసిన బొమ్మల వైవిధ్యమంతా యింతా గాదు. ఎండలో చెట్టుక్రింద కూర్చుని వేశాడు. మేడమీద పట్టు బాలీసుకు జేర్లాబడి వేశాడు. అతడు చిత్రించిన చిత్రాల చెన్ను మక్కినుంచి చెక్కిలివఱకు అక్కజం గొలిపేదే. పాడుతూ చిత్రించాడు. పలక్కుండా చిత్రించాడు.

'ఆకళారత్నమిస్సీకల్పియగుటెట్టు?
నవనీతపుంగుంచె నాడిసోకమి యెట్టు?
చిత్రకారుని సొగసు క్షితికి బరువౌటెట్టు ?'

మనమధ్య ఇప్పుడున్నాడు. అతని శిష్యబృందంయొక్క హృదయంలో శిలాక్షరమై వెలిశాడు.

శ్రీ చేమకూర సత్యనారాయణ, అద్దంకి వెంకటేశ్వర్రావు, వై. సుబ్బారావు, వి. భగీరథి మున్నగువారు అందుకు తార్కాణలు. వారి పేరు కీర్తులు వింటూవున్నాము. మరిన్నీ శ్రీ వెంకటరత్నంగారు రామారాయ కళామందిరంలో లలితకళావిద్యార్థుల్ని దైనందినం క్రమంగా శిక్షిస్తూవున్నారు. రామారావు కళాభవన నిర్మాణానికి గాను ఒక సమ్మథిరారుసంఘం ఏర్పడివుంది.

ఈసంస్థలనన్నింటినీ, ఈచిత్రకారుల నందరినీ కేంద్రీకరించి ఒక మహాసంస్థ ఈపట్నంలో వెలయించడం మనవిధి.

నిండు పున్నమినాడు వెన్నెలయొక్క పరిపూర్ణత నెంచవలెనేగాని చందురులోని నీలిమ నెవ్వరైనా చూడనగునా? అలాగునే రామారావుయొక్క అకాలమరణమువలన ఏదో అతని కళకు అసంపూర్తి వాటిల్లిందని మనము అనరాదు. అతడు చేయవలసిన ధర్మం అతడు పూర్తిగా నెరవేర్చుకొన్నవాడై తరలిపోయినాడు. అతని కళలో పరిపూర్ణత వుంది. ఆమాటకొస్తే ఈజగత్తులో ఏ చిన్న విషయమై చెప్పవచ్చినా అసలేం పూర్తిఅనేది లేనేలేదు...... అణువునుంచి మహదాకాశంవఱకూ దేనికదే నిండుకుండ. అటువంటప్పుడు మహత్తరమైన లలితకళ విషయమైయూ అసంపూర్తి ?

పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్ పూర్ణముదచ్యతే!
పూర్ణస్య పూర్ణ మాదాయ
పూర్ణమే వావశిష్యతే !

# 'నీకేసి చూసినంతమందీ...'

[ చిన్న కథ ]

నా స్నేహితులు వచ్చినప్పుడు నువ్వుకూడా వచ్చి మాతోబాటు కూర్చుని జంకులేకుండా ఎప్పుడు మాట్లాడుతావో అప్పుడే నాకు నిజమైన ఆనందం అని కథాప్రారంభంలో భార్యతో అన్న భర్త కథాంతంలో ఏమంటున్నాడో గమనించండి. స్త్రీస్వాతంత్ర్య వాదులుగావుండే కొందరు భర్తల మనఃపరిణామపుతీరు ఈకథ రూపిస్తూవుంది. —సంపాదకుడు.

రచయిత్రి :
శ్రీమతి బులుసు ప్రకాశమ్మ

౧

నేనో గొప్ప స్త్రీస్వాతంత్ర్యాభిమానిని. స్త్రీస్వాతంత్ర్యం నా ఆదర్శం. స్త్రీలకు పురుషులతోబాటు అన్ని విషయాలలోను సమానహక్కు లుండాలనేది నావాదన. ఈ విషయంమీద నేను అనేక స్త్రీల సభలలోనూ, పురుషుల సభలలోనూ ఉపన్యాసాలిస్తూ ఉంటాను.

గాంధీమహాత్ముడన్నా, ఆతడి సిద్ధాంతాలన్నా, నాకు అమిత గౌరవం. నా భార్యకూడా మంచి తెలివైనదీ ఉన్నతోద్దేశాలుగలదీను. మొదట్లో కొంత పల్లెటూరిదేగాని, నా యెడతెగని ట్రైనింగువల్ల ఆదర్శనారిగా మారిపోయింది.

మాది మొదట్లో తెనాలితాలూకా కూచిపూడి. అందుచేత కాంగ్రెసుతత్వానికి మొదటి మెట్టయిన ఖద్దరుధారణ మాకు మొదటినుంచీ అలవాటే. రెండవ మెట్టు ఐన హిందీభాషాభ్యసనాన్ని కూడా, ఓవిధంగా మేము ఎక్కేశామనే చెప్పవచ్చు.

విశారదపరీక్షల ఫలితాలు రావడమూ; మాయిద్దరి నెంబర్లూ వరసగా ఇరవై, ఇరవైయొకటి అని పడడమూ కూడా జరిగింది. పదిరోజులుంది పట్టప్రదాన మహోత్సవము. ఇద్దరమూ వరుసగా శ్రీమతి.........గారు, శ్రీయుత .........గారు అని అధ్యక్షుడు అంటూంటే వెళ్ళి ఒక్కమారే డిగ్రీలు అందుకోబోతున్నాం.

మా లలిత సంతోషానికి మితిలేదు.

మామూలుగా వాళ్ళూ, వీళ్ళూ విశారద లవడంలోనూ— మా లలిత విశారద అవడంలోనూ, సహస్రం తేడావుంది. లలిత పల్లెటూరిపిల్ల, ఇల్లే వైకుంఠం, మొగుడే కైలాసం అన్న ధోరణిలో వచ్చింది కాపురానికి.

పొద్దస్తమానం ఇల్లు సవరణ, పాడుల సంరక్షణా, వంటచేయడం, ఆవంటని నేను వచ్చేటప్పటికి వేడిగా ఉంచాలని అవస్థపడడం— ఇదీ లలిత దినచర్య. ఇరుగొద్దు, పొరుగొద్దు. వాళ్ళ నాన్న చిన్నప్పుడు కొంత సంస్కృతం నేర్పాడేమో, 'భర్తృహరి' అంటూ, ఓ పుస్తకంమాత్రం ఎప్పుడైనా చదువుకుంటుంది. నాస్నేహితులు మొగవాళ్లు ఎవరైనావస్తే వాకిట్లో చడి అవగానే తప్పచేసినదానిలానుంచుని కిందచూస్తూ-లేరనో, ఉన్నారనో చెబుతుంది.

'పురుషులలాగే స్త్రీలుకూడా సర్వస్వతంత్రులు. స్త్రీ పురుషుడికంటె ఏ విధంగానూ తక్కువకాదు. నీవు ఎవరికీ, చివరకి నాక్కూడా అంత విధేయత చూపడం అవసరంలేదు. నాస్నేహితులు వచ్చినప్పుడు నువ్వుకూడా వచ్చి మాతోబాటు కూర్చుని, జంకులేకుండా, ఎప్పుడు మాట్లాడతావో అప్పుడే నాకు నిజమైన ఆనందం కలగజేసినదానివౌతావు.' ఇది లలితకు నా మొదటిపాఠం.

హిందీలో అ, ఆ, లు మొదలెట్టిననాడే, సభ్య సంఘములో నడుచుకోవలసిన పద్ధతులమీద ఈపాఠంచెప్పాను. లలిత ఇప్పుడు అన్ని విషయములలోను ఉత్తీర్ణురాలైన విశారద.

౨

మెయిలు చాలా లేటుగా వచ్చింది స్టేషనుకి. స్టేషనంతా మనుష్యులమయంగా ఉంది. ఎవరో జమీందార్లుట. ఓ పెళ్ళివారుకూడా ఆరోజునే వచ్చారు ట్రైనుకి. చంకని పిల్లనెత్తుకుని, మసాలాగారెలు కొనుక్కు తింటున్న పల్లెటూరిపడుచు చోకామె—మసాలా గార్ల సందట్లో—మర చెంబుమరిచిపోయి వెళ్ళిపోతోంది.

కొత్తగా స్కూలైన బాలుడొకడు చెంబు ఆవిడకు జాగ్రత్తగా సమర్పించి, వెంటనే ఆపనిని ఉపకారాలబుక్కులో రాసేసుకున్నాడు. ఆ నానాభాగ, నానాజాతి సమ్మేళనంలో నా పక్కనే నడుస్తున్న లలిత ఎటో తప్పిపోయింది.

లలితను ఆడవాళ్ళ ఇంటరులో కూచోబెడదామనుకున్నాను. రాత్రివేళ, నిద్రసమయం కూడాను. పల్లెటూరుపిల్ల, ఈ స్టేషన్లూ, ఈ గడబిడలూ, ఎన్నడైనా, చూసిందా? పెట్టిందా? అంచేతే తప్పిపోయింది. కూలివెధవ నామాటవినిపించుకోకుండా తనకి తోచినపెట్టిలోకి సామానుతో ప్రవేశించడమూ, వెనకాలే పరిగెడుతున్న నేనూ ఆపెట్టెలోకే ఎక్కడమూ నాకు తెలియకుండానే జరిగిపోయాయి. 'హమ్మయ్య బతికానుబాబూ, మీరూ ఇందులోకే ఒచ్చారూ' అంటూ లలిత జరిగి నాకు చోటిచ్చింది. నా సమకాలిక విశారదులు రామారావూ, సుబ్బారావూ, శాస్త్రి లలితను జాగ్రత్తగా అక్కడ కూచోబెట్టినట్లు, తరువాత తెలిసింది నాకు.

ఎదరబల్లమీద కూచున్న పెద్దమనిషితో లలిత ఏదో సాహిత్యవిషయిక ప్రసంగం చేస్తోంది. ఇద్దరూ చలంగారి కథలలో భావనీ, వాడుకమాటలనీ పొగిడి, పొగిడి తన్మయులై పోతున్నారు. భావాలజోలికి పోవడంలేదు, అదీ ఒకందుకు మంచిదే అనుకున్నాను.

ఏంమంచి? పైకి అనకపోతేమాత్రం, మనసుల్లో అభావాలు సినీమాలాగ తిరగకుండా ఉంటాయా ? నిద్దరొస్తోందని ఆవలిస్తూ మాట్లాడకుండా కూచున్నాను.

పొడుగాటి ఓదులు చొక్కా, పక్క

బొత్తాములూ, బెంగాలీ పంచకట్టూ, పేడిముతీ, తేలకళ్ళూ, తుప్పలా లేగిన విగ్గులాంటి క్రాపూ, అర్థంగాని ఏదో లోకపుమాటలూ- భావకవిలా ఉన్నాడా పెద్దమనిషి. ఆయనను మా ఊరు వచ్చి, మాఇంట్లో పదిరోజు లుండమనీ, తనకి పద్యా లల్లడం నేర్పమనీ అడుగుతోంది లలిత. 'సరే' అంటున్నాడాయన. ఈ భావకవులదంతా అదోతంతు. లోకంలోఉండే ప్రతివస్తువూ, ప్రతి ప్రాణీ తమతో ఏదో బాధ చెప్పుకుంటోందంటూ, ఆ బాధని భావించుకుని, పద్యాలతో దానిని ఇతరులకు బోధ చేయడమూ, ప్రేయసి నొకత్తిని లేనిదాన్ని కల్పించుకునో, ఉన్నదాన్ని ఊహించుకునో

కొండను జారేమంచు
మిలమిలా
ఎండకుమెరిసే ఇసుక
తళతళా
పండబారినా ఆకు
బెళ బెళా
ఎండబారినా ఆకు
పెళపెళా
అన్నీ నీవే, అన్నిట నీవే
కనిపిస్తున్నావ్, ఉడికిస్తున్నావ్

అంటూ వలపోయడమూ, తప్పితే వీరికి వేరే పనున్నట్టు కనపడదు. ఈవేళ లలితకి ఎదర బెంచీమీద వీడు జతపడ్డాడేం? వీడు మా ఇంటికూడావచ్చి, లలితకు కవిత్వంకూడా నేర్పితే, ఆజానుబాహుణ్ణయిన నన్నో జువ్విచెట్టుగానో, సరుగుడు చెట్టుగానో పోల్చి ఈవిడ పద్యాలల్లడమూ, నేనవి పత్రికలలో చదివి, పొంగిపోవడమూ, సంభవిస్తుందిగాబోలు, లలితకు వాడితో మాట్లాడవద్దని, సంజ్ఞ చేదామాఅంటే, సుబ్బారావూ, రామారావూ, శాస్త్రి ఉన్నారు, అందుచేత ఊరుకున్నాను.

## ౩

దక్షిణభారత హిందీ ప్రచారక సభవారు, స్నాతకుల నాహ్వానించడానికి చాలా ఆట్టహాసంగా ఏర్పాట్లుచేశారు. త్యాగరాజనగరంలో ఇందుకై అలంకరింపబడ్డవారి సభాభవనం నిజంగా ఒక నగరంలా ఉంది.

పట్టప్రదానానంతరం ఉపన్యాస పరీక్షకూడా ఏర్పాటుచేయబడింది. 'జవహర్లాలూ: కాంగ్రెస్' మీద లలితా; 'సాంఘికజీవితమూ: స్త్రీలూ' మీద నేనూ మాట్లాడడానికి నిర్ణయించుకున్నాము.

ఉపన్యాసపరీక్ష ప్రారంభమైంది. 'నేటి విద్యావిధానమూ' 'బాల్యవివాహములూ''రాజకీయమూ: స్త్రీలూ' ఇలాగ ఎన్నో విషయములు చర్చింపబడ్డాయి. అంతాకూడా, చాలా బాగానే మాట్లాడారు. మహాత్ముడిచలవ అనుకున్నాను. లలిత అనే పిలుపురావడమూ, లలిత వేదిక ఎక్కడమూ రెప్పపాటులో జరిగాయి. లలిత బాగా చెపుతుందో, చెప్పదో- రసాభాసు అవుతుందేమో అని, నాగుండెలు దడదడ కొట్టుకోడం మొదలెట్టాయి. వేదికమీద లలితమూర్తి నా కళ్ళకి ఎంతో అందంగా కనపడింది. ఆకుపచ్చ రిబ్బను బార్డరు ఖద్దరుచీర, పొట్టిజంపరూ, పచ్చని ఆమె శరీరంతో ఐక్యమైపోయి ఆమెకే తగినట్టున్నాయి, లోలకులు మాత్రమే కనిపించనిస్తున్న బర్మాముడీ, నేను ముచ్చటపడి కొన్న కళ్ళజోడూ, లలిత నిజంగా స్వరాజ్య లక్ష్మిలా ఉంది.

ఉపన్యాసం ముగించి లలిత వేదిక దిగుతూఉంటే కరతాళధ్వనులతో నా చెవులు గింగురెత్తిపోయాయి. సుబ్బారావూ, రామారావూ, శాస్త్రి లలితకు వరసగా షేక్‌హాండిచ్చి కుర్చీ చూపించారు. లలిత ప్రశంసలో లీనమైవున్న వారి ముఖాలను పరీక్షించడంలో పడి నేను నావంతు ఉపన్యాసంలో పలకడానికి నెమరువేసుకుంటూన్న ముక్కలు నాలుగూ మరిచిపోయాను. నా ఉపన్యాసం నాలుగు ముక్కల్లో ఐందనిపించి వచ్చికూచున్నాను.

## ౪

'చలం' గారి 'శశాంక' చదువుతున్నాను. పక్కఇంటి రేడియో తొమ్మిది కొట్టింది. నిద్దరపట్టడంలేదు. గాలి అతి చల్లగా వీస్తోంది, రాబోయే పెద్దవానకు దూతికలాఉంది- ఆ చలిగాలి.

చిఱుజల్లు కిటికీలోంచి సందడిగా లోపలికి జొరబడుతోంది. తప్పుకాదా అని దీపం ఎగిరిపడుతోంది.

అద్దంమీద రెండు పిచికలు కూచుని, రహస్యం చెప్పుకుంటున్నాయి. కాళ్ళదగ్గిర శాలూపైకిలాక్కున్నాను.

'యార్‌కిమీఠీబాత్ సునీ దిలచాహత హైదిన్‌రాత్' అని సన్నగా పాడుకుంటూ, లలిత మంచినీళ్లు పట్టుకుని వచ్చింది గదిలోకి. పచ్చటివళ్ళూ,

# సు శీ ల

[౧౯౬-వ పేజీ తరువాయి.]

మెను చూడటంతోటే ఇవన్నీ 'అమ్మా' అని పిలిపించుకోవటానికి చేసే ప్రయత్నాలని రఘునాథరావు గ్రహించాడు.

మనోహరుడు తన తండ్రి కుర్చీ వద్ద కూర్చుని బొమ్మతో ఆడుకుంటున్నాడు.

మనూ! అన్నంతిన్నావా, నాదగ్గఅతిందువుగాని రాఅన్నాడురఘు.

'కాదు, నేనే తినిపిస్తాను' అని సుశీల జేలగా పలికింది,

సుశీల బంగారపు గిన్నెలోఉన్న అన్నంలో కూరవేసి కలిపింది. దానిలో గిన్నెడు నెయ్యిపోసి గుచ్చెత్తింది. మనోహరుడు ఆటలలో మునిగి ఉన్నాడు; పిలిస్తే రాడని తానే గిన్నెతీసికొని వానిదగ్గరకు వెళ్ళింది. కాని ఆమె గుండె దడదడ కొట్టుకుంటోంది. చివరకు ధైర్యంచేసి అన్నం పెడ్తాను, రా. మనోహర్, అని పిలిచింది.

'వద్దు' అని మనోహరుడు తలత్రిప్పాడు.

'నిన్ను ఎత్తుకొని తినిపిస్తాను; చందమామను చూపిస్తాను.'

'వద్దు, వద్దు; నేను తినను.'

'చూడు! ఈదినం వంకాయకూరను నీకోసం వండా; ఎంత బాగుందనుకున్నావు! రా, తిందువుకాని నేను నీఅమ్మనుకాదూ!' అని ఎత్తుకోపోయింది; సుశీల.

అబ్బ 'వద్దంటేను, నాకు అమ్మ పెట్టుతుందిలే అని మనోహరుడు కమల గదివైపుకు పరుగెత్తాడు.

ఇది చూచి సుశీల కొయ్యబారిపోయింది. రఘునాథరావు పకపక నవ్వాడు. ఆనవ్వు ఆమె నారీహృదయంలో తీక్ష్ణంగా నాటుకుపోయింది. ఇక అక్కడ నిలవలేకపోయింది. గబగబ గదిలోకి పోయి తలుపులు విసరివేసుకుంది.

'నేనువాడికి ఏమీకానా!నన్ను చూచి అట్లా ఎందుకు పారిజోతాడు. నేనేమన్నా బూచినా, వాడిని తినివేస్తానేమో అని భయపడేటందుకు! కాదు, దీని కంతకు మూలం కమలే. ఆమెను నీ ఇంటి నుంచి సాగనంపితే!......పాపం, ఆఅమాయకురాలు ఏమిచేసింది! ఆమె ఎంతమంచిది! నా కెంతసహాయంచేస్తోంది. ఆబిడే లేకపోతే యీపాటికి నాతిప్పలు యేమయ్యేవో!...కాని, మనోహరుడో! వాడు నన్ను చూడడన్నాచూడడే. నన్ను 'అమ్మా!' అని పిలవటం వాడికి బాగుండదు కాబోలు. వాడికి నేను అక్కనా! ఎంత ఎగతాళి! ఎంత హేళన! నేను చాల తప్పుచేసినాను; మొట్ట మొదటి నుంచి నేనే వానిని పెంచాలిసింది. కాని, నాదగ్గఅ కమలలోఉన్న ఆ నేర్పేది? ఆ ఓర్పేది? ఆమెంత పిచ్చిది! నాపిల్లవానికోసం తన ఒళ్లు పిండిచేసుకుంటోంది. ఎంత త్యాగం! నేను తల్లినయికూడా యిందులో పీసమంతయినా చేయలేకపోతున్నాను. కాదు, ఇక ముందునుంచి అట్లా జరగదు... నేను ఈపర్యాయం 'అమ్మా' అని పిలిపించుకుంటాను; తప్పక పిలిపించుకొంటాను ..............

ఆఁ. చివరకు మంచి ఉపాయకుతోచింది. నేనీ పర్యాయం తప్పక గెలుస్తాను. నామనోహరుడు నన్ను 'అమ్మా!' అని పిలుస్తాడు. ఇందులో సందేహంలేదు.

## 3

ఉదయం పదిగంటలయింది. రఘునాథరావు అప్పుడే భోజనం చేసి కచ్చేరికి వెళ్లాడు. ఆయన వెళ్లట చూలస్యంగా సుశీల తన గదిలోకి పోయింది. తలుపులువేసికొని క్రిందటిదినం తెప్పించిన బొమ్మల మూట విప్పింది. అందులో రకరకాల బొమ్మలు, రంగు రంగుల పటాలు వున్నాయి.

సుశీల అన్ని వస్తువులను చక్కగా సర్దింది. గది అంతా కలకలలాడిపోయింది. ఈపర్యాయం గెలుపు తనదనే విశ్వాసం కలిగిందామెకు. ఆమె మాతృహృదయము పొంగి పోయింది. సంతోషాన్ని పట్టలేక గంతులువేసింది. పరుగెత్తుకుంటూ మనోహరుని దగ్గఅకు వెళ్లింది. నీకు బొమ్మలు చూపిస్తాను, రా! నాయనా! రా అని అ

తనిచేయిపట్టుకుంది. బొమ్మలమాట వినేసరికి మనోహరుడు మెత్తపడ్డాడు. ఆమెతోకూడా గదిలోకి వచ్చాడు. గదిలోని మనోహర దృశ్యంచూచి నిశ్చేష్టు డయాడు.

మోటారుతీసి 'కీ' ఇచ్చి వదలింది. అది 'బుర్ బుర్' మంటు పరుగెత్తింది. మనోహరుడిక ఊరుకోలేకపోయాడు. దానిని చిక్కబట్టి చంకలోపెట్టి 'అమ్మ'కు చూపించి వస్తానని కమల గదివైపుకు పరుగెత్తాడు.

సుశీల ఖిన్నురాలయింది. ఆమె అభిలాష అడుగంటి పోయింది. ఆమె చేసిన ప్రయత్నమంతా, బూడిదలోపోసిన పన్నీరు మాదిరయింది. తన్ను తాను నిందించుకుంది. తన నిస్సహాయతకు దుఃఖించింది—'అయ్యో! మాతృత్వాని కింత ఘోరఅవమానమా! నామజ్జమాంసాదులిచ్చి కన్న కొడుకు తన్ను త్రోసి రాజనిపోతాడా నాపొడ కిట్టకుండాపోతుందా! ఇట్లా కాజాలదు. నేను వాడితల్లిని నాకు వానిమీద పూర్ణ అధికారముంది. అసలు కమలెవరు? పెంచిన మాత్రానే తల్లి అయిపోతుందీ? రక్తంతా ధారపోసినప్పటికి వానికి నేనేమికాను? కమలే నామార్గానికి కంటకురాలు. ఆమెను గెంటివేస్తేనేకాని మనోహరుడు నాచే జిక్కడు. అప్పుడుగాని నన్ను 'అమ్మా!' అని పిలవడు. కాబట్టి ముందీ నంగనాచిని సాగనంపాలి. ...కాని అది మెట్లా వీలవుతుంది? ఈ అనంత ప్రపంచంలో ఆమె ఎవరి పంచను తనతల దాచుకుంటుంది? బహుశః నేనేమైనా అంటే ఏడుస్తుంది కూడానేమో! ఊఁ, ఏడిస్తే యేడవనీయి, నాకేం! నేనేడవటంలేదు, నాబిడ్డకై? ఒక ముద్దుమాట వినడానికి యెంత తపించిపోతున్నాను. ఈ సంగతి ఆమె కేమైనా తెలుసూ?

సుశీల హడావిడిగా కమల గది దగ్గరకు వెళ్ళి 'ఇదిగో కమలా! నీవుచేసేపని ఏమీ బాగుండలేదు' అని అంది. కోపాన్ని వెళ్లగ్రక్కుతూ.

'ఏమిటి వదినా? నావల్ల యేమైనా పొరపాటు జరిగిందా యేమిటి? నేనేమైన తెలియక చేస్తే నువ్వు మందలించకూడదూ! ఎందుకు యింతకోపపడుతావు? అని కమల అతి జాలిగ అంది.

'ఎందుకు కోపపడను? నీవు మనోహరుని పాడుచేస్తోంటే' అని సుశీల గద్దించింది.

'వదినా! క్షమించు, మనోహరుని నేను పాడుచేయటంలేదు. వాడు నీ కుమారుడు అని నాకు తెలుసును; కాని వాడు నాకంటికి పాప నాశూన్య హృదయానికిజ్యోతి...'

'ఆగు, ఆగు; ఇకచాలు నీ ఉపన్యాసం, నీఉపన్యాసాలు. వినడానికి రాలేదు; కాని, మనోహరుడు నన్ను 'అమ్మా!' అని యెందుకు పిలవటంలేదో అడగటానికి వచ్చాను.'

'నాకేం తెలుసును, వదినా!'

'ఎందుకు తెలియదు? నీవే వాడికి నేర్పావని నాకు దృఢనమ్మకం'

ఇది వినేసరికి కమల మనస్సు చివుక్కుమంది. దుఃఖం పొంగి పొర్లివచ్చింది. ఏడుస్తూ తన గదిలోకి పోయింది. సుశీల గొణుక్కుంటూ వెళ్ళిపోయింది.

౪

మాటిమాటికి మాతృపదవికి భంగం కలిగే యింట్లో ఉండటం సుశీలకు దుస్తరమయి పోయింది. తన్నుదాను నిందించుకొనేది. ఆమె మనస్సు మాతృపదవి ప్రాప్తికి అహర్నిశం తపించిపోయేది. 'అమ్మా!' అని వినటానికి రాత్రింబవళ్లు విలపించేది. మనోహరుడు అసలు పిలిచేవాడేకాదు; పిలిస్తే 'అక్కా' అని పిలిచేవాడు. 'అమ్మ' శబ్దంలో దాగియున్న ఆమమత్వం, ఆస్నేహం, ఆవాత్సల్యం అక్కలో యెక్కడ? సుశీలకు తన అమూల్య వాత్సల్య సంపత్తిని ప్రదర్శించేటందుకు మనోహరు డెప్పుడు అవకాశమివ్వలేదు. అదిఅంతా ద్రవీభూతమై కళ్ళవెంబడి అశ్రురూపంగా ప్రవహించేది. ఆమె వేదనకు హద్దులేకపోయింది. ఈ బాధనుండి బ్రదికి బయటపడాలనుకునేది. కాని దారి కనుపించేదికాదు.

రఘునాథరావు భోజనం చేస్తున్నాడు, రఘునాథరావు ముద్ద నోట్లో పెట్టుకుంటు సుశీ! నీకు శుభవర్తమానం వినిపిస్తాను, నాకేమి బహుమాన మిస్తావని నవ్వుతూ అడిగాడు.

'సరే, వేడి వేడిచారువడ్డిస్తాను,

రఘునాథరావు విరగబడి నవ్వినాడు. సరేకాని, ఈవేళ మీ నాన్నగారి దగ్గఱనుంచి సీకు కోడలు పుట్టిందని ఉత్తరం వచ్చింది. అందులో తన ముద్దుల కూతురును రావలసినదిగా కూడా వ్రాశారు. వెళ్లుతావామరి?

'ఎప్పుడు?'

'రేపే, ఎల్లుండిపురుటిస్నానం.'

'సరే' 'అయితే ఎవరెవరు వెళ్లుతారు?'

'నే నొక్కదాననే. మనోహరుడు రాడుగదూ?'

సుశీలకు దుఃఖం ఆగలేదు. అశ్రువులను దాచడానికి వంటయింట్లోకి వెళ్ళిపోయింది.

కలకత్తా మెయిలు మద్రాసునుంచి రాత్రి ఏడున్నర ఘంటలకు బయలుదేరేది మైలాపూరునుంచి స్టేషనుకు వెళ్ళటానికి కనీసం పదిహేను నిమిషాలన్నా పట్టుతుంది. అందుకని 'డ్రైవరు' ఏడుగంటలకే కారు తీసికొనివచ్చి గేటులో పెట్టాడు. రఘునాథరావు మనోహరుని చంకలో యెత్తుకొని కారులో సామాను పెట్టిస్తున్నాడు. మధ్యమధ్య సుశీలను రమ్మనమని తొందర చేస్తున్నాడు.

సుశీల బరువైన హృదయంతో గదిలోనుంచి బయటకు వచ్చింది. ఆమెకు మనోహరుని విడిచిపెట్టి వెళ్ళవలసి వచ్చినందుకు హృదయంలో ఆందోళనగావుంది, కాని చేసేదేముంది! నెమ్మదిగా కమల గదిదగ్గఱకి వెళ్ళి 'వదినా! వెళ్ళివస్తాను; మనస్సులో యేమీ ఉంచుకోవద్దు నన్ను క్షమించు; బెజవాడనుంచి తిరిగి ఎప్పుడు వస్తావో! నీవు మాత్రం అప్పుడప్పుడు ఉత్తరంమాత్రం వ్రాయిస్తూఉండు' అనిచెప్పి కమల జవాబు వినకుండానే వెళ్ళి కారులో కూర్చుంది.

మనోహరుడు కారువంక, సుశీలవంక విచిత్రంగా చూడ మొదలుపెట్టాడు. వాని సుకుమార హృదయ సరోవరంలో ఎన్ని భావనాతరంగాలు లేచినాయో! సుశీల మనోహరుని కన్నార ఒకసారి చూచింది. ఆమె కండ్లవెంట గిఱ్ఱున నీళ్లు తిరిగాయి. ముఖం త్రిప్పేసుకుంది.

డ్రయివరు కారు 'స్టార్టు' చేశాడు. 'హారన్' ఊదుతూ ముందుకు నడిపాడు. కారు బయలుదేరటం తరవాయిగా మనోహరుడు గిలగిల కొట్టుకొంటూ తండ్రి చంకలోనుంచి క్రిందకుదూకి 'అమ్మా! అమ్మా!' అంటూ కారువెంట పరిగెత్తాడు, అతని కంఠస్వరం బాణం మాదిరిగా సుశీలగుండె దూసుకుపోయింది. ఆమె గభాలున కారులోనుంచి క్రిందకు దూకింది. కాని కారు కదలికలో ముందుకు పడిపోయింది. నుదుటను రాయి గ్రుచ్చుకొంది. ఇదంతా ఆమె కేమీ తెలియటంలేదు; గబగబ పరుగెత్తుకొనిపోయి మనోహరుని యెత్తుకుంది. ఇక ముద్దు●వర్షానికి అంతే లేకపోయింది,








## సుమనోహ్లాదిని

శ్రీయుత కవికొండల వెంకటరావుగారు రచియించిన పది కథల సంపుటి.

రావుగారు కవులుగానే కాకుండా కథకులుగాకూడా పేనుమిగిలినవారు, వారి చిన్న కథలలో ఒక ప్రత్యేకతవుంది.

'కలిపురుషుడు - చెల్లమ్మ సినీమా చూపు - బొచ్చుకుక్క - గాడిదపిల్ల కోమలం - పాపిష్టి పదిరూపాయల నోటు - పైనో ముద్దుకిందో ముద్దు - గోరీమీది చింబోతు - తేలుకొండి - పిస్టల్ వాత్ - వైరాగ్య ప్రసక్తి' అనేవి ఇందలి కథల శీర్షికలు.

ఈ కథలు చదవడంవల్ల కేవలం కాలక్షేపం కావడమే కాకుండా ఉల్లానికి ఉల్లాసం, మెదడుకి పని కలుగుతుంది.

గ్లేజు కాగితాలమీద చక్కగా ముద్రితమైంది. ఎనభైపుటలు. ఖరీదు నాలుగణాలు.

ప్రతులకు రాజమండ్రి ఇన్నుసుపేటలోని గ్రంథకర్తకు వ్రాయాలి.

---

## ప్రియురాలు

కథల సంపుటి. స్వర్ణలతా గ్రంథమాలలో మూడవ కుసుమము. శ్రీ ధనికొండ హనుమంతరావుగారు రచియించింది.

ప్రియురాలు, మంజుల, సౌఖ్యరాశి, కోర్కె అను నాలుగు కథలు ఇందు కలవు.

హనుమంతరావుగారు నేటియువక కథకులలో ఒకరు. కులాసాగా చదవతగ్గ పెక్కు కథల్ని వారు రచియించివున్నారు.

క్రౌను సైజు. గ్లేజు కాగితాలు. నూరు పుటలు. వెల ఆరు అణాలు.

ప్రచురించింది స్వర్ణలతా గ్రంథమాల స్వామ్యదారులు, కాకినాడ నివాసులు ఐన శ్రీ యలమర్తి రామమోహనరావుగారు. రావుగారు సారస్వతప్రియులగుట నవ్య కవుల గ్రంథాల ప్రచురణకు తోడుపడుతున్నారు. ఇందుకు వారికి మా ప్రశంసలు.

---

## చిత్రభాను పంచాంగాలు

ఆంధ్రభూమి ప్రకటనదారులయిన ముక్త్యాల అర్క రసాయనశాలవారున్నూ, బెజవాడి సార్సామృతండిపోవారున్నూ పంపిన చిత్రభాను గంటల పంచాంగాలు వందనాలతో అందుకొన్నాము.

రెండున్నూ జేబునందు ఇముడు చిన్న సైజున ముద్రితాలయి, ఉపయుక్త విషయాలతో ఒప్పుతూవున్నాయి.

---

## ఆంధ్రా హాలీవుడ్

తెనుగులో సినిమా పరిశ్రమ ఇప్పుడిప్పుడే కొత్త కొనలు సాగుతూవుంది. కాగా ఆ సంబంధమైన సారస్వతమేమీ ఇంకా తెనుగులో పొడసూపలేదు.

అట్టి సారస్వత నిర్మాణానికి తొలి ప్రయత్నం ఆంధ్రాహాలీవుడ్ ప్రచురణం దీని రచయిత శ్రీ ఇంటూరి వెంకటేశ్వరరావుగారు.

రావుగారి సినీమావిషయక వ్యాసాలు 'ప్రజామిత్ర', 'వాణి' మున్నగు పత్రికలలో ప్రచురితాలవుతూ ప్రజామోదాన్ని పొందుతూ వచ్చాయి.

ఆ వ్యాసాలకు శ్రీరావుగారు, ఇప్పుడు గ్రంథరూప మిచ్చారు.

ఈ గ్రంథంలోని విషయమే కాకుండా శైలికూడా నవ్యతతో అలరారుతూవుంది. చిన్నచిన్న వాక్యాలు, నాటివిన మాటలు, నడుమనడుమ చక్కని హాస్యం.

విషయమూ, శైలి కూడా కొత్తదనంతో కొమరారే ఈ గ్రంథం అత్యరాస్యమైన ప్రతి ఆంధ్రుడు చదవతగిందిగా వుంది.

వెల ప్రతి ఒక్కంటికి ఎనిమిది అణాలు.

చిరునామా: ఆంధ్రాఫిలిమ్ పబ్లికేషన్సు, 62, సర్ మహమ్మద్ ఉస్మాన్ రోడ్, త్యాగరాజనగరం, మదరాసు.

Printed at the Andhrabhumi Printing Works, 13 Mukhatal Street. Vepery P.O, Madras.
Editor & Publisher : Andra Seshagiri Rao B.A.

REGD. No. M. 4204. ANDHRABHUMI Estd 1933.



# ప్రపంచవీరులు

రచయిత:

శ్రీ కొత్తపల్లి శ్రీరామమూర్తి

గులాబిగుచ్ఛము



దేశభాషలందు తెలుగులెస్స

ప్రసూనము: ౧

గ్లేజు కాగితములు. 96 పుటలు. ప్రతి 1-కి ౮ అణాలు. పోష్టుఖర్చులు ప్రత్యేకము.

ఆంధ్రభూమి బుక్కు-డిపో, వేపేరి, మదరాసు.